# సదాశివ సమారంభాం








గురు దక్షిణామూర్తి | గురు వేదవ్యాస మహర్షి | గురు శుక మహర్షి | గురు నారద మహర్షి | గురు వాల్మీకి మహర్షి | గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం








గురు దత్తాత్రేయ | గురు బాబాజీ | గురు గౌతమ బుద్ధ | గురు ఆదిశంకరాచార్య | గురు రామానుజాచార్యులు | గురు జ్ఞానేశ్వర్









గురు రవిదాస్ | గురు కబీర్ దాస్ | గురు చైతన్య మహా ప్రభువు | గురు నానక్ | గురు రాఘవేంద్ర స్వామి | గురు వీరబ్రహ్మేంద్ర స్వామి | యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం









గురు త్రైలింగ స్వామి | గురు లాహిరి మహాశయ | గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి | గురు వివేకానంద | గురు సాయి బాబా | గురు అరబిందో








గురు రమణ మహర్షి | గురు యోగానంద | గురు భక్తివేదాంత ప్రభుపాద | గురు మళయాళస్వామి | గురు విద్యాప్రకాశానందగిరి | గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010005132

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# గాంధి మహాత్ముడు

రోమా రోలా

కాటూరి వేంకటేశ్వర రావు



సంస్కృతి ప్రచురణ

# గాంధి మహాత్ముడు

పరాసు రచన:

రొమ్యాఁ రోలా

ఆంగ్లీకరణం:

ఎల్. వి. రామస్వామి అయ్యర్

ఆంధ్రీకరణం:

కాటూరి వేంకటేశ్వర రావు

సంస్కృతి ప్రచురణ

(64)

వెల రూపాయిన్నర

# విషయసూచిక


| | | | |
|---|---|---|---|
| | మనవి | పుట | 6 |
| | ఆముఖము | ... | 7 |
| 1. | బాల్య యౌవనములు | ... | 9 |
| 2. | గాంధి – తిలకు | ... | 18 |
| 3. | గాంధి ధర్మమీమాంస | ... | 26 |
| 4. | సత్యాగ్రహ సమరారంభము | ... | 42 |
| 5. | సహాయ నిరాకరణోద్యమము | ... | 57 |
| 6. | గాంధి నాయకత్వము | ... | 78 |
| 7. | ప్రభంజన విజృంభణము | ... | 93 |
| 8. | నిర్బంధము – కోర్టు విచారణ | ... | 105 |
| 9. | మహాత్ముని సందేశము | ... | 121 |
| 10. | ఉపసంహారము | ... | 133 |
| | అకారాదిసూచి | ... | 137 |

# మనవి

ప్రఖ్యాత ఫరాసు రచయిత రొమా రోలా 1924 లో భారత జాతీయోద్యమ విశిష్టతను, గాంధి మహాత్ముని పాత్రను, సహాయ నిరాకరణోద్యమ నైతిక స్థాయిని వివరిస్తూ 'మహాత్మగాంధి' అను పుస్తకాన్ని ఫరాసు భాషలో వ్రాశారు. దీనిని శ్రీ ఎల్. వి. రామస్వామి అయ్యర్ గారిచే ఆంగ్లీకరించి, మద్రాసు, తిరువళ్లిక్కేణి లోని ప్రకాశకులు సంగు గణేశన్ గారు ప్రచురించారు.

ఈ ఆంగ్లానువాదం 1931 లో రెండు ముద్రణలను పొందినది. ఈ తెనుగు సేత దాని ద్వితీయ ముద్రణ ప్రతికి అనువాదమే.

ఆంధ్రానువాదాన్ని ప్రచురించుట కవసరమైన అన్ని హక్కులనూ మాకొసగిన శ్రీ సంగు గణేశన్ గారికి, అడుగగానే ఆంధ్రీకరించి యిచ్చిన సహృదయులు శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు గారికి కృతజ్ఞులం.

మద్రాసు–2<br>1-1-1958

ప్రకాశకులు.

# ఆముఖము

అతి గహనమైన భారతీయ విచార సరణి యందు నేను త్రోవ తప్పకుండ మిత్రుడు కాళిదాస నాగ సుధీమణి నన్ను వెన్నంటి యుండి అమితాదరముమై చరింప జేసెను. ఆయన యొనర్చిన యీ మేలును గ్రంథారంభమున ప్రియమార స్మరించుకొందును. తానింతగా దోడ్పడినను ఈ రచనలో ఇంకను కొన్ని దోషములు దొరలినచో ఆయన నన్ను క్షమింప గలడు. పశ్చిమ ఖండ వాసులకోసమని అవసర నైవేద్యముగా ఈ రచన మారంభించితిని. ఇది ముగిసిన పిమ్మట మరల యథావిధిగా, సవిస్తరముగా దీనిని రచించి సమర్పించుకొందును.

మదరాసు వాసి శ్రీ గణేశన్ తాను ప్రచురించిన గ్రంథ సంచయమందు చాల భాగము నాకు ప్రియమార నందించిరి. వా రొనర్చిన యీ మేలు మరచిపోలేను.

రొమాం రోలా

# మహాత్ముడు

మహాత్ముడు అంటే గొప్ప ఆత్మగల వాడు. ఈ శబ్దం ఉప నిషత్తులలో కనిపిస్తున్నది. పరమాత్మయందును, భక్తి జ్ఞాన యోగములచే తదైక్యము భజించు వారియందును ఇది వర్తించును.

శ్రీ రవీంద్రనాథ ఠాకూరు క్రిందటి డిసెంబరు నెలలో గాంధి ఆశ్రమానికి వెళ్లినపుడు,

> "ఏష దేవో విశ్వకర్మా మహాత్మా
> సదా జనానాం హృదయే సన్నివిష్టః
> హృదా మనీషా మనసాభిక్లృప్తో
> య ఏనం విదు రమృతా స్తే భవంతి."

అనే ఉపనిషద్వాక్యాన్ని గాంధి మహాత్ముని పరంగా అన్వయించి చెప్పెను.

# గాంధి మహాత్ముడు

## 1

## బాల్య యౌవనములు

దుర్బలమగు అల్పకాయము, పలుచని కోల మొగమున శాంత మొలుకు గోదుమవన్నె కనులు, విప్పారిన చెవులు. తలకు దెల్లని పాగ, మేన దెల్లని ముదుకవస్త్రము. చెప్పులు లేని పాదములు. భుక్తికి జేరెడు బియ్యము, ఇన్ని పండ్లు, ఇంత నీరు. నేలపై పడుక; ఒక్క కునుకు కునుకునో లేదో, ఎపుడు చూచినను అలయిక లేని పనిపాటులు. ప్రథమ దర్శనమున ఆ రూపమును మనము గమనింపము— అంతులేని దయాత్మమతే మన యెదుట నిలిచినట్లుండును. దక్షిణాఫ్రికాలో పియర్సను 1913 లో చూచినపుడు ఫ్రాన్సిసు యోగి జ్ఞప్తికి దగిలెనట. ప్రతిపక్షుల యెడ దయా గౌరవములు నెరపుచుండును. ఆ యడకువకు హద్దే లేదు. "నే నెచట పొరపడుచుంటినో" యన్నట్లు నిరంతరము ధర్మభంగ భీతితో మెలగుచుండును. నిజ దోషములను గప్పిపుచ్చడు. మనసు నెటులో సమాధాన పరచుకొనడు. మంత్రాంగముల కెన్నడు జొరడు. వాక్ఛమత్కృతుల పొంతబోడు—మొదలా తలపే యుండదు. తనకై మూగు జనతండముల సమ్మర్ద కోలాహలము లాయనకు గిట్టవు.

మిత్రు లడ్డుపడనిచో ఆసమ్మర్దముల నొక్కొక్కప్పు డాయన నలిగి పోవుటయు గద్దు. తనపై భక్తిచే నిల్లెగబడు జన తండములను ఆ మహాత్ము డేవగించుకొనును. జన సంఖ్యా బలమన్న ఆయనకు మనసులో సందియమే. చెలరేగిన జన తండముల 'మూకదౌరతన' మన్నచో రోతపడును. కొలది మంది శిష్యులతో నున్నపుడే ఆయన సుఖముగా, స్వస్థుడై యుండును. ఏకాంతమున ఆత్మారాముడై ఆత్మప్రబోధము నాలకించుచుండుటే ఆయన కానందము.

ముప్పదికోట్ల ప్రజలకు బురుపకారమును గరపి, బ్రిటిషు సామ్రాజ్యము నుజ్జూత లూగించి, మరల రెండువే లేండ్లకు లోకవ్యవహారమున ధర్మాభిరతికి నాంది పఠించిన మహాత్ము డాతడు.



గాంధి యనునది ఇంటిపేరు. ఆయన పేరు మోహన దాసు. తండ్రిపేరు కరంచందు. పోరుబందరు అను సంస్థానమున కరంచందు ప్రధానిగా నుండెను. ఆయనకు 2-10-1869 న మోహనదాసు గాంధి జనించెను. వారు అగ్రవర్ణులగు బ్రాహ్మణులుకారు గాని వారిది సిరిసంపదలు, విద్యాబుద్ధులుగల కుటుంబము. అహింసయే పరమధర్మముగా నెంచు జైనశాఖీయులు వారు. పిమ్మటి కాలమున గాంధి ఆ యహింసకే లోకమున, ఆచరణ ప్రచారములచే, పట్టము గట్టెను. జైనులకు జ్ఞానమార్గము కంటె భూతదయయే పరమేశ్వరుని బొందించు రాచబాట. రామాయణము వారి

యింట నిత్యపారాయణ గ్రంథము. చిననాడు చదువు చెప్పిన బ్రాహ్మణుడు గాంధిచే విష్ణుస్తోత్రము వల్లెవేయించెను. అంతియే కాని, సంస్కృతభాషను ప్రత్యేక మభ్యసింపవలెనని యను చింత గాంధిని విడువనే లేదు. ఇంగ్లీషు, సంస్కృతము నుండి తన్నట్లు దూరుని జేసినది కావున ఆంగ్లవిద్యాభ్యాసమునకు గాంధి విరోధియగుట కది యొక కారణ మయ్యెను. హైందవ ధర్మగ్రంథముల నాతడు లెస్సగా బఠించెను గాని వేదములను, ఉపనిషత్తులను చదువుటకు భాషాంతరమే ఆయనకు శరణ్య మయ్యెను.

గాంధి బాల్యముననే వివాహితుడై, ఉన్నతవిద్యను, ప్లీడరు పట్టమును గడించుటకై ఇరువదవయేట లండనుపురి కేగెను. అట్లు దేశాంతరమేగు గాంధిచే ధర్మవ్రత యగు నాతని తల్లి మూడు ప్రతినలు చేయించెను—మద్యమును, మాంసమును ముట్టనని, బ్రహ్మచర్యమును పాలింతునని. యూరపులో నివసించునపుడు గాంధి అన్యమత గ్రంథములను బఠించెను. హైందవ క్రైస్తవ ధర్మములలో నేది యుత్తమమా యని ఆ రోజులలో తన మనస్సు డోలాందోళన చెందెనని గాంధి 13-4-21 నాటి ప్రసంగమున నుడివెను. తుదకు "హైందవ ధర్మమే తనకు శాంతి దాయక" మని ఆయన నిశ్చయించుకొనెను. 1891 లో భారతభూమికి దిరిగివచ్చి, బొంబాయి హైకోర్టులో లాయరుగా బ్రవేశించెను. మరి కొన్నేండ్లకే లాయరు వృత్తి నీతిరహితమని యెంచి దానిని విడనాడెను. లాయరు వృత్తిలో నున్నపుడుగూడ దాను చేపట్టిన దావాలో

అధర్మమున్నదని తెల్లమగునేని ఆ వకాల్తా వదలుకొందునని ముందుగనే చెప్పిపెట్టెడివాడు.

అప్పటి కప్పుడే ఆనాటి రాజనీతివేత్తలగు పెద్దల వర్తనమును బరికించుచున్న గాంధికి తన జీవనపరమార్థము ఏమి కానున్నదో మనసున నించుకించుక గోచరింప దొడగెను. గాంధి జీవితమును మలచిన ఆ పెద్దలలో * మొదటి వాడు దాదాభాయి అను పారసీక మతస్థుడు. బొంబాయి కాతడు మకుటములేని మహారాజు. రెండవ యతడు గోఖలే యను పండితుడు. ఈయిరువురిదియు జాజ్వల్యమానమగు దేశభక్తి. గోఖలే భారత రాజకార్య ధురంధరులలో మేటి యగుటే కాక విద్యాభ్యాస పద్ధతిని తిరుగదోడిన వారిలో ప్రథముడు. దాదాభాయి భారత ప్రజోద్యమ పితామహుడు. అతడు గాంధి వ్యగ్రోత్సాహమునకు గళ్లె మిడి, ప్రజాజీవన రంగమున అహింసాచరణ మెట్లుండునో 1892 లో సలక్ష్యముగ ప్రథమోపదేశ మొనర్చెను. అదియే ప్రతిక్రియ సేయనొల్లని వీరము; పాపమును పాపముచే గాక ప్రేమచే నెదుర్కొను ఆత్మతేజోబలము. భారత భూమి లోకమున కుపదేశించిన మహామంత్ర మీ అహింసయే. దీనినిగూర్చి ముందుముందు వివరింపగలను.

* ఈ పెద్దలు రాజనీతి తంత్రమున నెరపిన దక్షత పిమ్మట కాలమున అతిక్రాంతమగుటచే ప్రజలు కృతఘ్నులై ఆ మేలును మరచిరి. గాంధి మాత్రము ఆ పెద్దలయెడ భక్తి భావము విడక, యువ భారతమునకు బలుమరు వారియెడ పూజ్యభావము గరపుచుండెను. (చూ. హింద్ స్వరాజ్., 23-3-1921 అస్పృశ్యుల నుద్దేశించిన జాబు, 13-7-1921 'భక్తి ప్రపత్తి'.)

రాజకీయ వ్యవహారములలో గాంధి 1893 లో ప్రవేశించెను. అది మొదలు 1914 వరకు దక్షిణాఫ్రికాలోనే ఆయన పరిశ్రమించెను. 1914 పిమ్మట భారత భూమియే ఆయనకు కర్మక్షేత్రమయ్యెను.

దక్షిణాఫ్రికాలో గాంధి నెఱపినది ఆత్మ తేజోబలము. అవిరతమగు ఆ విక్రమము, ఆ స్వార్థత్యాగము అపురూపములు. తన్మూలమున సాధించిన విజయముగూడ నేటి కాలమున సాటిలేనిది. ఇరువది వత్సరముల కాల మాతడిట్లు చేసిన వీరకర్మచే యూరపులో నించుక చలనము గాని, ఒకింత ప్రతిధ్వని గాని జనింపదాయెను. మన రాజనీతి వేత్తలయు, చరిత్రకారులయు, మననశీలురయు - తుదకు ధార్మికులయు - బుద్ధులు సంకుచితము లయ్యెననుట కింతకంటె నేమి సాక్ష్యము కావలెను?

1890-91 లో 1,60,000 భారతీయులు దక్షిణాఫ్రికాయంతట, ముఖ్యముగా నేటాలులో, స్థిరనివాసులైరి. ప్రవాహమువలె వచ్చి పడిన ఈ వైదేశికుల రాక అచటి తెల్లవాండ్రకు రంగు జాతులయెడ ద్వేషము పుట్టించెను. ఆ ద్వేషముచే నచటి ప్రభుత్వము రంగుజాతులపై బహిష్కారమును ప్రయోగించెను. భారతీయుల రాకపై ఆంక్ష పెట్టి అంతకుమున్నే వచ్చియున్నవారిని వెడలగొట్ట జూచెను.

మోయరాని పన్నులతో, తలవంపులగు పోలీసు చర్యలతో, బహిరంగములగు అత్యాచారములతో, కొల్లగొట్టుటలతో, దోపిడులతో, రాక్షసములగు హింసలతో అగచాట్లు పెట్టి వారికచటి బ్రదుకు దుర్భర మొనర్చిరి. తెల్లవాంగ్ర సభ్యతా రక్షణకట ఈ యత్యాచారము లన్నియు! 1893 లో అచటి భారతీయులు తమ కష్టములను గాంధికి విన్నవించి, సాయము వేడిరి. గాంధి యంతట నా దేశమునకు బోయి వ్రాలెను.

ప్రభుత్వ బలమునకు, జనతా పశుత్వమునకు నెదు రొడ్డి అంతఃకరణ ప్రేరితమగు ధర్మ బలముచే అచట నెఱపిన ఆ పోరు వీరగాథయై పోయెను. గాంధి అప్పటి కింకను లాయరే కావున ఆసియా వాసులను బహిష్కరించు అచటి శాసనము ధర్మ సమ్మతము గాదని కోర్టుకెక్కెను. ప్రతిపక్షు లెంత తీవ్రముగా నెదిరించినను గాంధి వాదమే గెలిచెను. పిమ్మట నచటి భారతీయులకు పౌరస్వత్వములను సంక్రమింప జేసి, ఆ హక్కులను భంగము కలుగకుండ కాపాడ నెంచి గాంధియు నచటి భారతీయులతో పాటు దక్షిణాఫ్రికా పౌర సామాన్యుడయ్యెను. జోహాన్సు బర్గులో లాభసాటిగా నున్న తన లాయరు వృత్తిని వదులుకొని, తొల్లిటి ఫ్రాన్సిసు యోగివలె, నిష్పచ్ఛరమును వరించెను. దీనులగు నచటి భారతీయుల కష్ట నిష్ఠురములలో బాలు పంచికొనుచు, ప్రతి హింసావైముఖ్యమును బోధించి, వారిని పవిత్రులనొనర్చెను.

అప్పటికే గాంధికి టాల్స్టాయి * మార్గ మచ్చుదల యయ్యెను గాన ఆ మార్గము వెంట డర్బాను పురముచెంత కర్షకావాస మొకటి నెలకొల్పెను. అచటి భారతీయు లందరిని కూడగట్టి, తలకింత యని భూమిని పంచియిచ్చి, వారిచే దారిద్ర్య వ్రతము పట్టించెను. అచట నికృష్టములగు పనిపాటులన్నియు దానే చేయజొచ్చెను. నోరు మెదల్చకుండ వారిట్లు ఏండ్ల తరబడి ప్రభుత్వమును బ్రతిఘటించిరి. వారు పట్టణములను వీడి వచ్చుటచే నచటి పరిశ్రమలు నీరసించెను. ఇది ధర్మ ప్రేరితమగు సమ్మెవంటిది. దీనిపట్ల బలప్రయో గము పనిచేయజాలదు. తొలినాటి క్రైస్తవుల పట్ల రోము సామ్రాజ్య బలముగూడ నిట్లే నిర్వీర్య మయ్యెను. గాంధి తాను ప్రతిక్రియ చేయకుండుటే గాదు. తన్ను పీడించు వారి కాపద వచ్చినపుడు వారి నాదుకొన నేర్చెను. ఇంతటి ప్రేమ బలము తొలినాటి క్రిస్టియన్ల కేనియు నుండియుండదు. దక్షిణాఫ్రికా ప్రభుత్వము విపత్తుల పాలైనపుడెల్ల గాంధి తన సహాయ నిరాకరణమును కట్టిపెట్టి ప్రభుత్వమునకు

* 1918 లో టాల్స్టాయి మరణించుటకు ముందు గాంధికొక జాబు వ్రాసెను. దానిని నా మిత్రుడు పాల్ బిరుకాఫ్ నాకు పంపించెను. గాంధి ప్రచురించుచున్న 'ఇండియన్ ఒపినియన్' అను పత్రికను టాల్స్టాయి చదివి అందలి అహింసా వీరమున కెంతయో సంతసించెను. ఆ ధర్మ సమరమునకు టాల్స్టాయి విజయము నాశించి, అహింసయే ప్రేమ మార్గమనియు, ఆత్మైక్యమును భజించు సాధనమనియు, క్రీస్తు మున్నగు మహర్షులా ధర్మమునే ఉపదేశించిరనియు కొనియాడెను.

టాల్స్టాయి గాంధికి వ్రాసిన మరికొన్ని జాబులు మాస్కో భాండారమున గలవనియు 'టాల్స్టాయి, ప్రాచ్యుడును' అను పేర వాటిని బ్రచురింతుననియు బిరుకాఫ్ నా కిటీవల తెలిపెను.

దోడ్పడెను. 1899 లో బోయరు యుద్ధమున వ్రణితుల కుప చారము కల్పు రెడ్ క్రాసు దళము నేర్పరచెను. ఆ దళము యుద్ధ మధ్యమున చేసిన సేవను ప్రభుత్వ మొకసారి కాదు, రెండుసార్లు ప్రస్తుతించెను. 1904 లో జోహాన్సు బర్గు పట్టణము మహామారి వాతబడినపుడు గాంధి యొక చికిత్సా లయము నెలకొల్పెను. 1906 లో నేటాలు వాసులు ప్రభుత్వము నెడ తిరుగుబాటు చేసిరి. ఆ యుద్ధమున వ్రణి తోప చారక దళముతో గాంధి చేసిన మేలును నేటాలు గవర్నరు స్తుతి పూర్వకముగ జాటి చెప్పెను.

## 3

దాక్షిణ్యపూర్వకముగ చేసిన యీసేవ రంగుజాతుల పట్ల ద్వేషమును హరింపలేక పోయెను. గవర్నరు చేసిన ప్రశంస ఒకవంక చెవులలో నింకను మ్రోగుచుండగనే గాంధి కారాబద్ధు డయ్యెను. పలుమార్లు కఠిన దండము విధించిరి. బోనులోనుంచి, కాల్సేతులు దాని చువ్వలకు బంధించిరి. జనసమూహ మాయనపై బడి మర్దించి, అవమా నించి, కొనయూపిరితో విడిచెను. స్వధర్మ రక్షణకై తొల్లి ప్రాణము లొడ్డిన వారు పడిన బాధలకు, పరాభవములకు నిట్లు గాంధి అగ్గమయ్యెను. ఈ హింసలతోపాటు ఆయన ధర్మనిష్ఠ పెరిగెనేగాని ఇంచుకంతయు తరుగలేదు. దక్షి ణాఫ్రికా యందలి ఈ హింసావాదమును ఖండించి, దయా వీరమును ప్రతిపాదించు 'హింద్ స్వరాజ్' అను ప్రసిద్ధ గ్రంథమును 1908 లో ఆయన రచించెను.

ఇర్వది యేండ్లవరకు నీ పోరాట మట్లు తీవ్రముగ సాగుచునే యుండెను. 1913 లో హేమంతకాలమున గాంధి నేటాలునుండి ట్రాన్సువాలుకు ఈ నిష్ప్రతిక్రియో ద్యమమును విస్తరింప జేసెను. వేలకొలది భారతీయులతో గాంధిని మరల నిర్బంధించిరి. ఇంతమందికి బందిఖానాలలో చోటులేక గనులలోనే బంధించి యుంచిరి. ఈ తూరి భారతభూమి యంతయు ఈ దారుణ కర్మకు మూలముట్టుగ చలించెను. వైస్రాయి లోకభీతికి దాళలేక, దక్షిణాఫ్రికా ప్రభుత్వ చర్యను నిరసింపవలసి వచ్చెను.

దుర్దమమగు ఈ ధర్మదీక్షయు, మహాత్ముని ప్రభావ మును ఫలించెను. బాహువీర్యము దయావీరమునకు దల యొగ్గెను. స్మట్సు సేనాపతి భారతీయుల కోరికలకు ప్రబల విరోధి; భారతీయులకు వ్యతిరేకముగ చేసిన శాసనమును దేనిని తా నుపసంహరింపనని 1909 లో ప్రతిజ్ఞ చేసెను. అట్టివాడు మరి నాలుగేండ్లకా శాసనమును చేసేత నుప సంహరించుకొని, సంతసముమై నిట్టూర్చవలసి వచ్చెను. హార్డింజి ప్రభువు భారతీయుల పక్షము వహించెను. విచా రణ సంఘ మేర్పడి గాంధి వాదమున బ్రత్యక్షరము నామో దించుచు దీర్పు చెప్పెను. దక్షిణాఫ్రికాలో దమ యిచ్ఛమై పనిపాటులు చేసుకొనగోరు భారతీయు లందరికి అచట నివ సించు హక్కును ప్రసాదించు శాసనము 1914 లో నిర్మిత మయ్యెను. నిష్ప్రతిక్రియోద్యమ మిట్లిరువదేండ్లు స్వసుఖ త్యాగ మొనర్చి జయమును చూరగొనెను.

———

# 2

# గాంధి - తిలకు

ప్రజా నాయకుడను ప్రతిష్ఠ ముందు నడువ నిట్లు గాంధి స్వదేశమున కేతెంచెను. ఈ శతాబ్ది ఆరంభముననే ఇచట భారత స్వాతంత్ర్య ఉద్యమము సంఘటిత మయ్యెను. అప్పటికి ముప్పదేండ్ల క్రిందటనే ఏ. ఓ. హ్యూమ్, సర్ వి. వెడ్డర్బరన్ వంటి బుద్ధిశాలులగు కొంద రాంగ్లేయులు ఇచట నేషనల్ కాంగ్రెసును నిర్మించిరి. ఈ యుదార పురుషులు ఆంగ్ల సామ్రాజ్యాధిపత్యమును భారత క్షేమముతో సమన్వయించు పూనికమై చిరకాలము కృషిసల్పి, నేషనల్ కాంగ్రెసులో సామ్రాజ్య భక్తికి కొంతచోటు కల్పింపగల్గిరి. ఇంతలో జపాను రష్యాను జయించెను. ఆ విజయము ఆసియా ప్రజలలో స్వాభిమానమును పుట్టించెను. కర్జను ప్రభువు దుశ్చర్య లందుకు దోడ్పడై ప్రభుభక్తులగు భారతీయుల మనస్సులను వికలమొనర్చెను. అంతట కాంగ్రెసులో అతివాది వర్గము తలయెత్తి ప్రజాదరమునకు బాత్ర మయ్యెను. రాజనీతి ప్రధానమగు రెండవ వర్గమునకు గోఖేలు నాయకు డయ్యెను. 1914 వరకు ఆవర్గ మటులే నిలిచి యుండెను. గోఖేలు నిష్కళంక దేశభక్తు డయ్యు ఆంగ్ల సామ్రాజ్య సంబంధము నభిమానించెడివాడు. మఱి భారతప్రజ నావరించిన స్వాభిమానము కాంగ్రెసు నావహించుటచే కాంగ్రెసు ప్రతినిధులు 'స్వరాజ్యము' కావలె

నని కోరిరి. ఆ స్వరాజ్య మెట్టిదో కాంగ్రెసు నాయకు లైక
మత్యమున నిర్వచింప లేకైరి. కొందరు ఇంగ్లండుతో
సహాకరించుటకు స్వరాజ్య మంగీకరించు ననిరి. మరికొంద
రాంగ్లేయులతో తెగతెంపులు గావలెననిరి. మొదటివారు
దక్షిణాఫ్రికా కెనడాల నుదాహరింప, రెండవవారు జపాను
నెత్తి చూపిరి. ఈ స్థితిలో గాంధి యోచించి, తన హింద్
స్వరాజ్ నుపదేశించెను. గాంధి యుపదేశించిన ఈ
లక్ష్యము రాజనైతిక మనుటకంటె ధార్మికమనుట యొప్పును.
తక్కిన వానికంటె గాంధి లక్ష్యము సమూల సంస్కారము
నపేక్షించును. నిజమునకు గాంధి కప్పటికీ లక్ష్యమును
సాధించు మార్గముగాని, ప్రయోగ విధానముగాని, సాధక
బాధకములుగాని కరతలామలకముగ లేవు. దక్షిణాఫ్రి
కాలో చిరనివాసముచే భారతీయాత్మ స్వరూపమును,
అహింసా ప్రభావము నాయన కవగతమైనమాట నిజమే
కాని స్వదేశముతో నాయనకు చిరవియోగము గూడ నేర్ప
డెను. కావున ఆయన ఇచటి స్థితిగతులను పరిశీలించుచు,
అంతర్ముఖుడై, సాధక బాధకములను గూర్చి ఆలోచించు
కొనెను.



1914 లో మహాయుద్ధ ముప్పతిల్లు నాటికి సామ్రాజ్య
మున కెదురొడ్డు ఆలోచన గాంధికి లేదు. కావుననే
వ్రణితోపచారకదళము నేర్పరచుటకై ఆయన ఇంగ్లండు
కేగెను. "నేను సామ్రాజ్య పౌరుడనని మనసార నమ్మి

చున్నాను.'' 1921 లో ఆయన వ్రాసిన మాటలివి. 'భారత భూమి యందున్న ఆంగ్లేయులకు' 1922 లో వ్రాసిన లేఖలలో పలుసారు లీమాటలనే తడవుచు నేమనెనో చూడుడు: ''ప్రియ మిత్రులారా! ఈ 29 ఏండ్లనుండి ప్రజావ్యవహారములలో ఆంగ్లేయులతో నేను నెరపినంత సహకారమే యాంగ్లేయుడు నెరపియుండడు. ఇంగ్లండు కోసమై నాలుగుసార్లు నాప్రాణము లొడ్డితిని. 1919 వరకు నేను మనఃపూర్వకముగ సహకారమునే నమ్మి, ఆమాటనే జపించుచుంటిని.''

సహకారమును గాంధి యొక్కడే కాదు నమ్మినది; 1914 లో ధర్మయుద్ధమను కపటాశయమును భారత ప్రజలందరును నమ్మి మోసపోయిరి. యుద్ధమున భారతీయుల సాయము గోరుచు ఇంగ్లం డెన్నియో ఆశలు చూపి, వాగ్దానములు చేసి మురిపించెను. విశ్వాసముమై ఆదుకొన్నచో భారతీయుల చిర వాంఛయగు స్వపరిపాలన మనుగ్రహింతు ననెను. 1917 లో స్టేటు సెక్రెటరిగానున్న ప్రజ్ఞాశాలి యగు యి. యస్. మాంటాగూ బాధ్యతాయుత ప్రభుత్వమిత్తుమని మాట యిచ్చెను. వైస్రాయి చెమ్సుఫర్డు ప్రభువు, సెక్రెటెరీ మాంటాగూ సంప్రదించుకొని, భారత రాజ్యాంగ సంస్కరణ ప్రణాళికను రచించి 1918 జూలై నెలలో ఉభయుల సంతకములతో ప్రకటించిరి. మిత్ర సేనలస్థితి అప్పటికి చాల గడ్డుగా నుండెను. 2-4-1918 న లాయడ్ జార్జి మంత్రి భారతప్రజల సాయము నర్థించుచు విన్నపము చేసెను. ఆ మాసాంతముననే ఢిల్లీలో జరిగిన

యుద్ధకార్య సమావేశము "భారత స్వాతంత్ర్య మిదిగో, చేరువనే యున్న" దను ఆశ కల్పించెను. భారతమంతయు భక్తిపూర్వకముగ నొక్కటై సాయపడ నాయత్త మయ్యెను. 9,85,000 మందిని భారతభూమి ఇంగ్లండుకు సాయమంపుటేకాక ఇంక నెన్నియో త్యాగముల నొనర్చెను. ఈ భక్తి విశ్వాసము లూరకపోవని నమ్మి భారత ప్రజ రాజానుగ్రహము నెదురు చూచుచుండెను.

ఒక్క భయంకరాఘాతముతో భారతప్రజ ఈ కల నుండి మేలుకొనెను. ఆ సంవత్సరాంతమున మిత్రసేనలకు గండము గడచిపోవుటతో భారత మొనర్చిన సాయముగూడ వారి స్మృతినుండి జారిపోయెను. యుద్ధవిరామ సంధి కుదురగానే ప్రభుత్వము తన మాయవేషమును విసర్జించెను. భారతభూమికి మున్నులేని స్వాతంత్ర్య మీయకపోగా ఉన్న దానిని ప్రభుత్వము హరింపబూనెను. విశ్వాసముతో అంతటి మేలుచేసిన భారతభూమిని ఇంగ్లండు నమ్మలేక పోయెను. ఈ ఘోరమునకు 1919 ఫిబ్రవరిలో సామ్రాజ్య శాసనసభ యందు ప్రవేశపెట్టిన రౌలట్టు చట్టములే ప్రబల సాక్ష్యము. యుద్ధకాలమందమలులోనున్న భారత రక్షణ చట్టమునకు ప్రాణముపోసి రహస్య పోలీసు చర్యలను, ఇతర నిరోధములను కొనసాగించుటకీ బిల్లు లేర్పడెను. శాత్రవాక్రమణ వేళలందు ప్రజలకు గల్గదగిన బాధలన్నిటికి పుట్టలవంటి వీ చట్టములు.

భారతప్రజల భ్రమ యంతటితో పటాపంచలై, ఒక్కపెట్టున ప్రబల విరక్తి పొడచూపెను. తిరుగుబాటున కదే మొదలు. దానికి గాంధి ప్రాణము పోసెను.

౨

అంతకు గ్రిందటి వత్సరములలో గాంధి కర్షక జనుల యోగక్షేమములకై కొన్ని సంస్కారము లొనర్పబూనెను. కైరా, చాంపరాను మండలములందు నడి చప్పుడు లేకుండ దన అహింసా బలప్రయోగముచే రైతుల కడగండ్ల నుడిపి, విజయము సాధించెను. ఆ సాత్త్విక వీరమునే పిమ్మట నాతడు భారత స్వాతంత్ర్య సమరమందు ప్రయోగించెను. ఆయన దానికి సత్యాగ్రహమని పేరిడెను. ఆ సత్యాగ్రహాస్త్రమున కాతడే ద్రష్ట. దాని విచారణము పిమ్మట గావింతును.

1919 వరకు రాజకీయములనుండి గాంధి వైదొలగి యుండెను. 1916లో అతివాదవర్గము లన్నిటిని ఆనీబిసెంటమ్మ ఒక్క దారికి దెచ్చెను. పిమ్మట నా యతివాదులు బిసెంటమ్మను గాదని లోకమాన్య బాలగంగాధర తిలకును నాయకుడుగా వరించిరి. లోకమాన్యుని ధీశక్తియు, క్రియాశక్తియు నసాధారణములు. ఇచ్ఛాజ్ఞానశక్తు లాయనలో దృఢబంధమును భజించి, సచ్ఛీలముతో బెనవైచుకొన్నవి. బుద్ధి సంపదలోనేమి, ప్రాగ్దేశ సంస్కృతిసార పుష్టిలోనేమి ఆయన గాంధికంటె మేటి. ఆ మహాపండితుడు తన ప్రతిభ నంతటిని దేశారాధనమునకు ధారవోసెను. గాంధివలెనే ఆయ

నయు స్వలాభచింతారహితుడు. జన్మదేశమునకు స్వాతంత్ర్యమును గడించిపెట్టిన పిమ్మట ఏకాంతమున మరల శాస్త్రవ్యాసంగము చేసికొన నభిలషించెను. బ్రదికినన్నాళ్లు భారతభూమి కాయనయే ఏకనాయకుడు. 1920 ఆగష్టులో ఆయన అకాలమృత్యుహతి జెందకున్నచో నేమయ్యేడిదో ఊహింపలేము. లోకమాన్యుని ప్రతిభకు గాంధి భక్తిమై చేతులు మోడ్చును. కాని ప్రజోద్యమ నిర్వహణమందు సాధన విధానములలో గాంధికి మతభేద మున్నది. లోకమాన్యుడు జీవించి యున్నచో గాంధి రాజకార్యముల జోలికేగక, కేవల ధార్మికోద్యమములకే కట్టువడి యుండెడి వాడనుట నిశ్చయము. ఈ యుభయుల నాయకత్వము లభించియున్నచో భారతప్రజల ఉత్సాహశక్తి ఎట్లుండెడిదో! లోకమాన్యుని క్రియాశక్తికి మహాత్ముని ఆత్మశక్తి తోడైనచో మరి దాని నడ్డగింప శక్యమగునా? విపరీత విధిచే నట్లు జరిగినదికాదు. లోకమాన్యుని అస్తమయము భారతీయులను దౌర్భాగ్యమునను, గాంధిని దురవస్థలోను ముంచెను. లోకమాన్యుడు సజీవుడై యుండి ప్రజాబాహుళ్యమును నడపికొని పోవుభారము వహించినచో గాంధి శిష్టజనమునకు నాయకత్వము వహించెడివాడు. కొలదిమంది శిష్టులమధ్య నీతి ధర్మప్రచారమును, ఆచరణమును సల్పుట గాంధి స్వభావమునకు, అభీష్టమునకు అనుగుణము. గాంధికి మందిపై నమ్మకము లేదు. లోకమాన్యుడు గణితశాస్త్రజ్ఞుడగు కర్మవీరుడు. సంఖ్యాబలమం దాయనకు నమ్మకము. ఆయన ప్రజాతంత్రపు టుగ్గుపాలతో బెరిగెను. ధర్మజ్ఞుల విధి

నిషేధములను లెక్క-సేయని రాజనీతి చతురు డాయన. 'సాధువులకు రాజనీతి జోలి యేల,' అనుచుండెడి వాడు. తన ప్రజల స్వాతంత్ర్యసిద్ధికై ఆ మహాపండితుడు సత్యము నేనియు వదలుకొనగలడు. నిష్కళంక చరితుడగు ఆ గృహస్థు రాజ తంత్రమున మాత్రము విధి నిషేధములను, ధర్మా ధర్మము లను బాటించెడి వాడు కాడు. మాస్కో పాలకులగు సర్వాధి కారుల యోజనలకు, లోకమాన్యుని యోజనలకు సామ్య మున్నదని చెప్పదగును. బోల్షివికు తత్త్వముతో గాంధికి మాత్ర మెన్నడు పొత్తు కుదురజాలదు (బోల్షివికు తత్త్వము నాతడు స్పష్టముగా నిరాకరించెను). గాంధి లోకమాన్యు లకు పరస్పరము గౌరవాదరము లున్నవి. అట్లయ్యు వా రుభ యులు నెంత కూడబలికికొన జూచినను ఉభయ మార్గము లందున్న వైరుద్ధ్యమే బయలయ్యెను. తిలకు వలెగాక, గాంధి సత్యరక్షణమునకై స్వాతంత్ర్యమును విడనాడవలసి వచ్చినచో విడనాడుదునని ఎలుగెత్తి చెప్పెను. మాతృ దేశము నెడ తన కెంత భక్తి యున్నను, మాతృభూమి కంటె తనకు ధర్మమే అధిక మనెను. "సర్వదాత్రియగు నా తల్లి నేలపై నాకు పరమభక్తి కద్దు. భారతభూమి లోకమునకు ధర్మభిక్ష పెట్టగలదని నాకు నమ్మకమున్నది. అట్టి భారతము శస్త్రధారణ మొనర్చిన నాడు నాకది అగ్ని పరీక్షయే. ఐనను నేనందులకు వెనుదీయ కుందునుగాక. నా ధర్మమునకు దేశావధులు లేవు. ఆ ధర్మమున నాకు ప్రబల నిష్ఠ యున్నచో నా మాతృదేశభక్తి నది అతిక్ర మింపగలదు." (11-8-20 'యంగిండియా')

మహానీయములు కదా ఈ మాటలు! మనము వర్ణింప నున్న సమర యోధ కీ మాటలే మహాభాష్యములు. ఈ భారత ధర్మాచార్యున కీమాటలే లోక గురుత్వము నర్పించి జగత్కుటుంబకుని జేయుచున్నవి. కడచిన నాలుగేండ్లుగా భారతమున ఈ స్వరము సర్వ మానవ కల్యాణము కొఱకై ప్రవర్తిల్లుచున్నది.

---

# 3

# గాంధి ధర్మమీమాంస

రౌలటు బిల్లుపై తిరుగుబాటునకు నాయకత్వము వహించినపుడేనియు "హింసనుండి దాని మరల్చుటకే" అట్లు చేసితినని గాంధి చెప్పిన మాటను (5-11-1919) మనము గమనింపదగును. తిరుగుబాటు తనంతట దా వచ్చిన దనియు, దానిని మంచి దారిని బెట్టవలయు ననియు ఆయన యెరుగును.

గాంధి ధర్మమూలమున రెండు వేర్వేరు పొరలున్నవి. అందలి అడుగుపొర సువిస్తారము, సుదృఢమునగు పరమార్థము. రెండవది లౌకికమగు వ్యావహారిక ధర్మము. సువిశాలమగు మొదటిది మూలము. దానిని దేశ కాలానుగుణముగా పదనుచేసి, దానిపై రెడవదానిని ఆయన నిర్మించును. స్వభావముచే గాంధిది పారమార్థిక దృష్టి. విధిలేక ఆయన రాజనీతిలో దిగెను. ఈ విషయమును గ్రహింపనిచో భారత రాజకీయ వ్యవహారముల వికాసమును గ్రహింపలేము.

ఇతర నాయకులు నిష్క్రమించి, సందర్భము లట్లు త్రోసికొని రాగా గాంధికి నాయకత్వము తప్పదయ్యెను. తుపాను మధ్యమందున్న భారత వ్యవహార నౌకకు చుక్కాను పట్టుటతో, లౌకికమగు రాజ నైతిక వ్యవహారము ఆయన వర్తనమున ప్రాధాన్యము వహించెను. అట్లయ్యు ఆతడు చేసిన నిర్మాణ మూలమున ధర్మ భిత్తికయే ఉన్నది. గంభీ

రము, విశాలమునగు ఆ త్రిపీఠకము దేవాలయ నిర్మాణమున కుద్దిష్టమైనను, అవసరమును బట్టి తొందరలో వేరు నిర్మాణము జరిగెను. ఆ మూల భిత్తి ఎన్నటికి చెక్కు చెదరదు. అవసరమునకు గట్టిన ఉపరి గృహము తాత్కాలికము, అప్రధానము. శాశ్వతమగు ధర్మము ఆ గర్భాలయమందే గాంధికి సాక్షాత్కరించెను. గాంధి ధర్మమున కుద్బోధకమగు ఆగర్భాలయ స్వరూపమును మనము దర్శించి తీరవలెను. లౌకిక ప్రవృత్తికి వలయు పుష్టిని నూతన శక్తిని సంపాదించుకొనుటకు గాంధి నిత్యము ఆగర్భాలయమున ఏకాంతము భజించెడి వాడు.



తన ప్రజ లాచరించెడి హైందవ ధర్మము పట్ల గాంధికి తీవ్ర నిష్ఠ యున్నది. అట్లయ్యు, శాస్త్రార్థములు సేయు పండితుల ఉబుసుపోకవంటిది కాదది. కనులు మూసికొని సాంప్రదాయమును నమ్ము భక్తియు గాదది. ఆయన విశ్వాసమునకు అంతస్సాక్షియు, వివేకము నియంతలు.

"మతమును నేను పూజాపీఠముపై గూర్చుండబెట్టను. మతము పేర పాపములను సమర్థింపను లేను. కార్యకారణ వివేచనచే నేను నమ్మింపజాలని వాని నొక్కనినేనియు నా వెంట గొనిపోవ నిచ్చలేదు. వివేచనకు నిలువని శాస్త్రములు పరమ ప్రమాణములు (అపౌరుషేయములు) గావనుటకు గూడ నేను వెనుదీయను." (27-10-1920)

మరొకవంక, హైందవ ధర్మముల ప్రత్యేకతను, కేవలత్వమును గూడ ఆయన విశ్వసించడు. అదియు సముచితమే. "అపౌరుషేయత మన వేదములకే కాదు. బైబిలు, కొరాను, జెండవస్తాలకు గూడ కలదు. హైందవ ధర్మము ప్రచారక మతముగాదు. లోకమందలి ఈశ్వరద్రష్ట లందరు మనకు మాన్యులే. స్వభావ స్వధర్మాను గుణముగా అందరు నీశ్వరపూజ చేసికొనుటకు మన ధర్మ మనుమతించును. కావున సామరస్యమేగాని మనకే మతముతోడను విరోధము లేదు."

అనేక శతాబ్దులుగా హిందూ ధర్మమున బ్రవేశించిన దోషములను, పాపములను ఆయన యెరుగని వాడు కాదు. వాని నెల్ల ఖండించెను.

"నాకు నాభార్య యెట్టిదో హైందవమత మట్టిది; ఇంతకంటె నేమి చెప్పగలను? ఆమెవలె మరి యేవనితయు నా హృదయమును కరగించజాలదు. ఆమెకు లోపములు లేవని కాదు. నాకు తెలిసినవి, తెలియనివి కూడ లోపము లామె కుండుగాక, మా యిరువురకు విడరాని బంధమున్నది. ఎన్ని దోషములు, లోపములు ఉన్నను హిందుమతము గూడ నాకట్టిదే. హైందవ ధర్మగ్రంథములలో గీతలు, తులసీరామాయణము, నాయెరిగిన వీరెండే. వాని గాన మాధురిచే గలుగు పారవశ్యము నాకితరముచే గలుగదు. హైందవుల దివ్యక్షేత్రములందు నే డెన్నో అకార్యములు జరుగుచున్నవి. అట్లయ్యు నాకవి ప్రీతిపాత్రములే. నేను ముమ్మాటికి సంస్కర్త నగుట నిజము. అట్లయ్యు, సంస్కా-

రావేశముచే హిందూమత సారభూతములగు వానిని నేను తిరస్కరింపబోను.'' (6-10-1921 'యంగిండియా')

౨

తనకు విడరానివియు, హిందూమత సారభూతములు నగు ఆ సత్యము లేవో 6-10-1921 న ఆయన వివరించెను.

1. ''వేదములు, ఉపనిషత్తులు, పురాణములు మున్నగు ధర్మగ్రంథము లన్నియు నేను విశ్వసింతును. కావున అవతారములను, జన్మాంతరములనుగూడ నమ్ముదును.
2. వేద విహితమైన వర్ణాశ్రమధర్మముల నంగీకరింతును. నేడు వ్యవహారమందున్న అపరిష్కృత వర్ణాశ్రమ ధర్మములు కావవి.
3. గోరక్షణము, పరమార్థతః నాకు గావలయును. నేటి గోరక్షణము అట్టిది కాదు.
4. విగ్రహపూజపట్ల నా కవిశ్వాసము లేదు.''

ఈ పంక్తులను చదివిన ఐరోపీయు లందరు ''ఇది యెక్కడి ధర్మము? ఏ నాటిది? ఇది యేమి చిత్తవృత్తి? దీనితో మన కెక్కడ పొత్తు కుదుర నేర్చును'' అనుకొందురు. వా రట్లు తొందరపడక మరికొంత దూరము చదివినచో ఈ క్రింది పంక్తులు, తమ చిత్తవృత్తికి చేరువగా నుండునని కన్పించును.

'''అహింసా సత్యబ్రహ్మచర్య వ్రతము లాచరింపని వాడును, అసంగ్రహము, సంపత్త్యాగము నేరని వాడును

శాస్త్రముల నెరుగ'డను సుభాషితమును నేను ముమ్మాటికి విశ్వసింతును."

ఈ మాటలు మన ధర్మగ్రంథమునకు దగ్గరి చుట్టములు. ఈ చుట్టరికమును గాంధి పూర్తిగా నెరుగును. మత ప్రచారము చేయు నాంగ్లేయు డొకడు "మీకుద్బోధకములగు గ్రంథము లెవ్వి?" అని యడుగగా, గాంధి వెంటనే "బైబిలులో ఉత్తర కాండ (New Testament)" అనెను. (పిమ్మట రస్కీను, టాల్‌స్టాయిల గ్రంథములను గూడ చేర్చెను.) "ఈశ్వరుని, ధర్మము నాశ్రయింపుము. ఇతర మెల్ల నిన్నాశ్రయించును," అని క్రీస్తు చెప్పిన మాటలతో గాంధి తన "నీతిపథము" (Ethical religion) అను గ్రంథమును ముగించెను. ఈ ప్రాచ్యదేశ భక్తునకు టాల్స్టాయి ఉపదేశములు పుష్టినిచ్చెననుమాట మనము ఏమరగూడదు. రస్కీను, ప్లాటోల గ్రంథముల నాతడు స్వభాషలోని కనువదించెను. థోరో (Thoreau) ఆయనకు ప్రమాణ పురుషుడు; మాజినీ సమ్మాన్యుడు; ఎడ్వర్డు కార్పెంటరు గ్రంథములు బహువార పఠితములు; అమెరికా, యూరోపుల సమ్యగ్జ్యోజనల సారము నాయన పీల్చుకొనెను అనియు మనము స్మరింపదగును. ఈ మహనీయుని భావములను సరిగా గ్రహింపగల యూరపు వాసులకు అవి క్రొత్త యనిపించుటకు గారణము లేదు. అట్లు గ్రహింపగల వారికి గాంధి ధర్మసూత్రములు నాలుగును ఆశ్చర్యమును గూర్పవు. వాని పరమార్థము గోచరించును. ఆ నాల్గు ధర్మములలో గోరక్షణము, వర్ణాశ్రమములు—ఈ రెండును భారత దేశ ధర్మము

నకు, పాశ్చాత్య ధర్మమునకు నెంతటి అంతర మున్నదా యనిపించును.* నిజమే కాని ఈ రెంటికి గాంధి చెప్పెడి వ్యాఖ్య యేమో చూతము.

## 3

గాంధి ధర్మమున ఈ సూత్రములు అప్రధానములు, ఔపచారికములు కాని మాట నిజము. హైందవ ధర్మమునకు గోరక్షణము సహజ లక్షణము. గోరక్షణమును గాంధి మానవత్వ పరిణతికి ప్రధాన చిహ్నముగా నెంచును. ఎందువలన నందురా? "మానవుడు పశుజాతితో సఖ్య సమాఖ్య చేసికొనెను. పశుజాతి కంతటికి గోవు ప్రతీకవంటిది. ఆ ప్రతీకయే ఆ యుభయుల సఖ్యమునకు చిహ్నము" గనుక. మఱియు గాంధి "ఈ ధర్మముచే మానవుడు మానవత్వము నతిక్రమించి సకల ప్రాణులతో అభేదమును భజించును" అని చెప్పెను. ఇన్ని జంతువులుండగా, గోవుకే ఆధిక్య మొసగనేల యన్నచో భారతభూమికి గోవు సంపదనిచ్చు పరమ మిత్రము గనుక. పరమ సాధువగు గోవు గాంధికి "కరుణరస మహాకావ్యము." నిరర్థకమగు గోపూజ కాదిది. నోరులేని జంతువులపట్ల దయమాలి శాస్త్రప్రమాణముల నుదాహరించుచు, గోపూజ గోపూజ యని జపించు హైందవుల క్రూరతను గాంధి ఏవగించుకొనును. ఈ ధర్మసూత్రమ్మ

* గాంధి ప్రతిమార్చనమును సమ్మతింపనివాడు కాడు. "ప్రతిమచే నాకు భక్తి ఉదయింపదు......కాని ప్రతిమార్చనము మనుజ స్వభావ సిద్ధము." (6-10-1921 'యంగ్ ఇండియా.')

మును అన్నీసి యోగి యొక్కడే యెరుగును. దాని నెరిగి నచో గోరక్షణ ధర్మమును గాంధి యేల పాటించునో తెల్ల మగును. ఇంతటి మహార్థముతోడనే గాంధి "హైందవ మతము లోకమునకు గోరక్షణమను ధర్మభిక్ష పెట్టిన" దన్నచో నందు దోష మేమున్నది? క్రైస్తవ ధర్మము "నీ పొరుగు వానిని నిన్ను వలెనే ప్రేమింపు" మని చెప్పగా దానికి గాంధి "ప్రాణికోటి యంతయు నీ యిరుగు పొరుగే" యని కలిపెను.

పాశ్చాత్యులకు వర్ణాశ్రమధర్మ తాత్పర్యము మరియు గహనము గావున వారు సులభముగా దానిని గ్రహించి, సమ్మతింపజాలరు. దానిని గూర్చి గాంధి తాత్పర్యమును దెలియచెప్పి, పాశ్చాత్యులను సమ్మతింపజేయు నేర్పు నాకున్న దనను. కాని ఈ ధర్మమును గూర్చి గాంధి చేసిన వ్యాఖ్యానమును బరిశీలించినచో ఒక్క విషయము మాత్రము తేలును. ఈ వర్ణవ్యవస్థయం దుత్తమాధమ భేదములు లేవు. ఆయా వర్ణాశ్రమస్థుల యోగ్యత కుచిత మగు ధర్మములను విధించుటయే దాని పరమార్థము.

"మానవ స్వభావమందే నిష్ఠమైయున్న ఈ వర్ణా శ్రమ ధర్మమునకు హైందవమతము శాస్త్రత్వము మాత్రమే కల్పించినదని నాకు దోచును."

ఆయన నాలుగు వర్ణములనుమాత్ర మంగీకరించును. బుద్ధిజీవులు, ఆముష్మిక ధర్మావలంబులునగు బ్రాహ్మణులు; శస్త్రజీవనులు, పాలకులునగు క్షత్రియులు; వార్తాజీవనులగు వైశ్యులు; శూద్రులు—ఈ నాలుగే వర్ణములు. ఈ నాల్గిం

టిలో ఆయన ఉత్తమాధమ భేదము సేయడు. ఇవి వృత్తి భేదములే కాని అధిక మేమియు లేదు. విహిత ధర్మా చరణమే కాని ప్రామిశోను హక్కులు లేవు.

"ఒకనికి ఆధిక్య మొసగి, మరొకని నైచ్యమునకు బాలుసేయు స్వభావము హైందవ ధర్మమునకు విరుద్ధమని నా యభిప్రాయము. జ్ఞానబలముచే బ్రాహ్మణుడు, బాహు బలముచే క్షత్రియుడు, వర్తక నైపుణిచే వైశ్యుడు, శారీరక శ్రమచే శూద్రుడు—ఈ యందరు ఈశ్వర సృష్టిని సేవింప వలసినవారే. ఇట్లనుటచే బ్రాహ్మణునకు కాయకష్టముతో, ఆత్మరక్షణ పరరక్షణములతో బనిలేదని యెంచగూడదు. బ్రాహ్మణుడు పుట్టుకచే జ్ఞానప్రధానుడు. వంశపారంపర్య ముచే, శిక్షణచే ఇతరులకు జ్ఞానోపదేశ మొనర్చుట ఆతనికి ప్రధానము. వలయునేని శూద్రునకు జ్ఞాన సంపాదనము నిషిద్ధము కాదు. కాని, శరీరముచే సేవించు యోగ్యత ఆతని కధికము. ఇతరులకుగల ప్రత్యేక సేవాయోగ్యత కాత డసూయ చెందరాదు. అంతియే కాదు; తాను జ్ఞానా ధికుడనని గర్వించు బ్రాహ్మణుడు జ్ఞానహీనుడై, పతితు డగును. ఆత్మ సంయమము, శక్తిని పొదుపుగా వాడుకొనుట ఇదియే వర్ణాశ్రమ ధర్మము."

వర్ణాశ్రమధర్మము సుఖత్యాగ మూలకమేగాని భోగ మూలకము కాదు. మరియును జన్మాంతరమును నమ్ముటలో నొక విశేషముగూడ నున్నదని మనము మరవజనదు. బ్రాహ్మణునకు శూద్రత్వమును, శూద్రునకు బ్రాహ్మణత్వ మును జన్మాంతరముల బ్రాప్తింపవచ్చును. దీనిచే సృష్టియం

దొక సమతాధర్మము నెలకొనును గదా!

ఈ నాలుగు వర్ణములలో వృత్తిభేదమే గాని తారతమ్యములు లేవు. మరి అంత్యజు లనబడువారికి ఈ వ్యవస్థతో సంబంధము లేదు. సాంఘికమగు ఈ యన్యాయ్యమును గాంధి ఎంత తీవ్రముగా ప్రతిఘటించెనో మనకు దెలియగలదు. మనసు కరగించెడి ఆయన ఋషిత్వ లక్షణములలో నిది ప్రధానము. హిందూమతమున కీ యన్యాయ్యము మాయని మచ్చ యనియు, అవమాన హేతువనియు, హైన్యాపాదక మనియు ఆయన యెంతో సంతాపము పొలగును.

"నేను పునర్జన్మము కోరను. మరల పుట్టవలయు నేని అస్పృశ్యుడనై పుట్టి, వారి కడగండ్ల ననుభవించి, తద్విముక్తిని సాధింప నభిలషింతును."

ఆయన ఒక అస్పృశ్య బాలికను పెంచుకొనెను. ఏడేండ్ల యీ చిన్నారి పసిదాని ముద్దు ముచ్చటలు ప్రియమార చెప్పికొనుచు, ఆ బాలయే తన కంటి వెలుగుగా, తన యింటి చలువగా నెంచి మురిసిపోవు చుండును.

గాంధి ధర్మసూత్రముల మరుగున నెట్టి దివ్యహృదయమున్నదో గ్రహించుట కీ మాత్రము చాలును. టాల్‌స్టాయి హృదయమున నింతటి కోమలత్వము, నింతటి సులభ సంతుష్టియు లేదు. క్రైస్తవు డను మాటకు సామాన్యార్థము చెప్పికొందుమేని ఆ రష్యను కంటె ఈతడే క్రైస్తవ స్వభావు డనవచ్చునేమో! టాల్‌స్టాయి స్వభావ

ముచే కంటె అభిలాషచే క్రైస్తవుడని యెంచి, యిట్లన వలసి వచ్చెను.

౪

పాశ్చాత్య సభ్యతను గాంధి ఖండించుటలోనే ఆయన మనస్సును టాల్‌స్టాయి ఎంతగా లోగొనెనో మనకు దెలిసి వచ్చును.

యూరపునందు ఉదారబుద్ధు లెందరో, రూసో నాటి నుంచి, నేటి సభ్యతను తెగడుచునే యుండిరి. నిద్ర మేల్కొనిన ఆసియాకు ఆ వ్రాతలే చాలును-తన్నాక్ర మించిన యూరపును నిందించుటకు. ఆ వ్రాతలలో చాల భాగము ఆంగ్లేయులవే. గాంధి ఆ వ్రాత లన్నిటిని చదివి, తన 'హింద్ స్వరాజ్' గ్రంథమున నుదాహరించుకొనెను. ఇంతకు, పాశ్చాత్య సభ్యత నొరులు నిందింపనేల? తన పాపాచరణము నదియే చిత్రించుకొన్నది. పరదేశముల నాక్రమించి, ప్రజాపీడనము సల్పి, వారి రక్తము నోడ్చి, ఆ రక్తముతో నది రచించుకొన్న గ్రంథము నెవరు ఖండింప గలరు? సభ్యతా రక్షణము పేర నిన్న మొన్న నది చేసిన యుద్ధము చాలదా-సిగ్గుమాలినదాని వంచనము, క్రౌర్యము, కాపట్యము, రక్తదాహము బట్టబయ లగుటకు? భయంకరమగు పాశ్చాత్య సభ్యతా నిజస్వరూపమును లోకమంతయు గనులార గనుగొన్నది. దెసమొలతో నిట్లు నిలిచి నది చాలక, "ఇదిగో! నన్ను చూడ రం"డని ఆఫ్రికా, ఆసియా వాసులను చేరబిలిచిన ఆ సభ్యత కింకను లజ్జాభి

మానము లెక్కడ? వారు దానిని చూచి, చెప్పిన తీర్పు ఇదిగో:—

"యూరపును నేడు లోగొన్న సభ్యతా స్వరూప మెంత రాక్షసమో మొన్నటి యుద్ధమే తెలిపినది. ధర్మము పేరు జెప్పి ఈ విజేతలు నీతి సూత్రముల నన్నిటిని మంట గలిపిరి. 'ఇది ఘోరాసత్యము, ఎట్లు పలుకుదుము' అని వారు వెనుకాడినది లేదు. సకల దోషములు అవినీతి ప్రేరితములే...యూరపులో క్రైస్తవ ధర్మము లేదు. అది ధన దేవతనే కొలుచుచున్నది." (8–9–1920 'యంగ్ ఇండియా')

భారతదేశములోను, జపానులోను ఇట్టి భావములే పలుమారు ప్రకటితము లయ్యెను. కొందరు పైకి చెప్పుట ఉచితము కాదనుకొనిరే కాని వారి హృదయములం దీ భావములు మలచుకొని పోయినవి.

మొన్నటి యుద్ధ విజయమున కిదియే కాదు; ఇంత కంటెను దుష్ఫలితము లున్నవి. గాంధికి మాత్ర మీ పాశ్చాత్య సభ్యతా నిజరూపము 1914 కు బూర్వమే తెలిసి వచ్చెను. దక్షిణాఫ్రికాలో ఉన్న ఇరువదేండ్లలో ఆయన కది నిజరూపమును జూపెట్టినది. 1908 లో రచించిన 'హింద్ స్వరాజ్' లో ఈ నూతన సభ్యతకే ఆయన 'మహా పాప' మని పేరిడెను.

సభ్యత యని పేరేగాని గాంధి దీనిని కలియుగ లక్షణ మనును. ఐహిక సుఖమే ఇది పరమార్థముగా నెంచును. దీని ప్రభావము వలననే పాశ్చాత్యుడు తన ధన సంపాదనమునకు మురిసిపోవు చున్నాడు. ఆ సంపదకు

దాసుడై, శాంతిదూరుడై, ఆంతర దృష్టిరహితుడగు చున్నాడు. దుర్బలుల పాలిటికి, కష్టజీవుల పాలిటికి నరక మిది. సకల జాతుల ప్రాణశక్తిని ఇది హరించుచున్నది. ఈ రాక్షస సభ్యత తన్ను దానే దహించుకొను కాల మాసన్నమైనది. భారతదేశమునకు నిజమైన శత్రు విదియే గాని ఆంగ్లేయులు కారు. ఆంగ్లేయుల పాప మిందు లేదు. వారి నావేశించి, వారి రక్తమున కెక్కి సివమెత్తించు వారి సభ్యత ననవలెనుగాని వారి ననబనిలేదు. భారతదేశము నుండి ఆంగ్లేయులను వెడలగొట్టి, వారి సభ్యతకు మాత్రము పట్టము గట్టజూచు భారతీయులను గూడ గాంధి నిరసించెను. "వ్యాఘ్రము వలదు, వ్యాఘ్రస్వభావము కావలెను అనుట వంటిదిది. పాశ్చాత్య సభ్యతను ప్రతిఘటించుటయే మనము చేయవలసిన ఘనకార్య" మనును.



లాయర్లు, వైద్యులు, అధ్యాపకులు—ఈ మూడు వృత్తుల వారిని గాంధి తీవ్రముగ నిరసించును.

భారత ప్రజను మాతృభాషకు, సంస్కృతికి దూర మొనర్చి, భారత బాలకులను అవమానమున కగ్గ మొనర్చిన దీ అధ్యాపకులే. బాలుర చిత్తములను సంస్కరించి, శీలవంతులను జేయ యత్నింప రీ అధ్యాపకులు. కాయకష్టమును చులుకనగా జూతురు. ఇదియే వీరు నిందాపాత్రు లగుటకు గారణము. నూటికి ఎనుబదిమంది కర్షకులు, పదిమంది యంత్రస్వాములు (Industrialists) నున్న యీ దేశమున

అందరికి నొక్క తీరుగా గ్రంథస్థ విద్య నేర్పుటకంటె మహా దోషము వేరుండదు......ఇక లాయరు వృత్తి నీతిదూరమే కదా! భారతదేశము నందలి కోర్టులు ఆంగ్లాధిపత్యస్థాపన కుపకరణముల వంటివి. ప్రజలలో పరస్పరము వైరములు పెట్టి, కలహములను, కొట్లాటలను ఇవి పెంచును. మనుజుని దుస్స్వభావమును పనిగొనుటకు సాధనము లివి. ఇక డాక్టర్లంటిమా, వారిపట్ల గాంధికి మొదట ఆదరమే ఉండెడిది. క్రమముగా ఆవృత్తి మాన్యము కాదని తెలిసివచ్చినది. పాశ్చాత్య వైద్యము శరీరమునకు రోగబాధ తొలగింప జూచునే గాని తన్మూలకారణమగు దుర్వృత్తులను, వ్యసనములను మాన్ప యత్నింపదు. పాపఫలమగు బాధనుండి ఈ వైద్యము తమ్ము తప్పించగలదను ధైర్యముచే ప్రజలు పాపరతులగుట తటస్థించుచున్నది. కావున ఇది పాప కార్యములను ప్రోత్సహించు చున్నదనియు నెంచవచ్చును. ఈ యింద్రజాలపు మందులవలన ప్రజలు నీతిహీనులు, నీరసులు నగుచున్నారు. * శరీరమును, మనస్సును నిగ్రహించుకొను ధీరత్వ మీమందులవలన ప్రజలకు కొరవడి పోవుచున్నది. ఈ బూటకపు మందుల జోలి కేగక, రోగములు రాకుండ పరిహరించు మార్గముల నుపదేశించుచు 'ఆరోగ్య దర్శిని' (A Guide to Health) అను గ్రంథము నాయన రచించెను. యిరువదేండ్ల అనుభవము కొలది

* పరిశోధనార్థము జంతువులను ముక్కలుగా కోసెడి యీ వైద్యశాస్త్ర పద్ధతి గాంధికి బొత్తిగా గిట్టదు. దాని నాయన మహాపాతకముగా నెంచును.

వ్రాసిన ఆ గ్రంథము వైద్యశాస్త్రము, నీతిశాస్త్రము గూడ నగును. "రోగములకు శారీరక కర్మయే కాదు మానసిక కర్మయు కారణమే. కావున రోగములను పరిహరించు మార్గములను సులభముగా సూత్రీకరింపవచ్చును. ఆరోగ్య విధుల అతిక్రమణమే అన్ని రోగములకు మూలము. ఈ శరీరము ఈశ్వరాలయము. కావున దీనిని పవిత్రముగా, శుచిగా నుంచవలెను." గాంధి చెప్పిన సూత్రములలో చాల సదుపదేశము లున్నవి గాని, నిర్వివాదములగు చికిత్సా పద్ధతులను గూడ నిషేధించుటలో ఆయన హఠస్వభావము కన్పించుచుండును. నీతివర్తన విషయమున గూడ కఠోరత గన్పించుచున్నది.* ఇవి యన్నియు నొక యెత్తు; యంత్రము దొక యెత్తు. ఈ కలికాల సభ్యత కదియే మూలకందము. ఈ వికృత విగ్రహపూజను విడనాడి తీరవలెను. భారత భూమిని ఈ యంత్ర దాస్యమునుండి తప్పించు గాఢవ్రతము నాయన చేపట్టెను. యంత్ర దాస్యముతో చేతులు గలుపు స్వాతంత్ర్యముకంటె భారతదేశమునకు ఆంగ్లవిపణిదాస్యమే ఆయన మేలనును. "మనదేశమున యంత్రములు నెలకొల్పుకొనుటకంటె మాంచెస్టరుకు ధనము నంపుటయే మేలు. అమెరికా రాక్ ఫెల్లరు (యంత్రస్వామి) కంటె భారతీయ రాక్ ఫెల్ల రెన్నటికి మంచివాడు కాడు. యంత్రము మానవ జాతికి దాస్యబంధనకారి, కామముచే వలెనే ధనముచేగూడ మనుజుడు నిస్సహాయు డగును."

* కామ సంబంధమగు ఆయన కఠోర నియమములు సెయింటు పాలును దలపించుచుండును.

భారతీయులలో నవీన బుద్ధులు "మరి రైళ్లు, ట్రాములు, యంత్రపరిశ్రమలు లేనిచో భారతదేశము గతి ఏమగును?" అని అడుగుదురు. "అవి లేకుండ ఇంతకాలము గడవలేదా?" అని గాంధి బదులు చెప్పును.

"ఫోటుపాట్లవలె ఎన్నో సామ్రాజ్యములు పుట్టి అణగుచుండగా, భారతదేశము వానిమధ్య ఇన్ని వేలేండ్లు నిశ్చలముగా నిలిచియున్నది. ఏది లేకున్నను భారతభూమి ఆత్మజయమును సాధించి, సుఖస్వరూపమును గ్రహించినది. మహానగరములను, యంత్రబలమును భారత మభిలషించ లేదు. తాతలనాటి రాట్నము, పాతకాలపు బల్లెచదువులే దానికి జ్ఞానరక్షులు, శుభదాత్రులు నైనవి. సనాతనమగు ఆ సాత్త్వక జీవనమును మన మందుకొనవలెను–ఒక్క యురుకున గాదు–క్రమముగా, ఓర్మిమై, పెద్దల అడుగు జాడలవెంట జేరవలెను."

ఇదియే గాంధి యాలోచనల సారము. ఇంతకంటె మరియేమి కావలెను? పురోగమనమునకు,* పాశ్చాత్య దర్శ

* పాశ్చాత్య దర్శనము లిటనుండి తొలగియేగిన పిమ్మట ఆ యా శాస్త్ర పరిశోధనలకు వీలు కల్పింపవలె నవియే గాంధి ఆశయము. పాశ్చాత్య దార్శనికుల ఉత్సాహమును, త్యాగమును గాంధికి సమ్మాన్యములే. భారత యోగుల దీక్షా విరాగముల కంటె అవియే అధికములని ఆయన పరిగణించును. పశ్చిమఖండ రజఃప్రవృత్తి ఆయనకు గౌరవ భాజనమే కాని అది నడచెడి దారు లాయనకు గిట్టవు. ఈ మాత్రము వినాయించినను పాశ్చాత్య సభ్యతపట్ల ఆయనకు ప్రతిషేధము కలదని విస్పష్టమే. కావుననే ఈ ప్రాతకాలపు గాంధి యాలోచనలకు టాగోరు తగిన రీతి ప్రతివచించెను.

నములకు (Sciences) ఉచ్చాటన మంత్ర మిది. మానవుని ఉత్సాహశక్తి నిప్పులు గ్రక్కుచు ముందునకు సాగివచ్చు చుండ ఈ ప్రాతకాలపు విచారపుంజము దానితో డీకొని ముక్కలై పోవునేమో. అట్లు పురోగమించు నుత్సాహ శక్తిని మానవైక్యమునకు చిహ్నమనుట యుక్తము. ఏల యన, విశ్వాత్మయందు స్వరమేళనము గోచరించును. స్వచ్ఛందములగు స్వరకల్పన లెన్నో అందు మేళవించి ఏకత్వమును భజించును. ప్రథమ యౌవనమందున్న మన పశ్చిమఖండము స్వచ్ఛంద పరవశయై, ఆ మేళమునకు తానే సార్వకాలిక కర్తను గానని గ్రహింపజాల కున్నది. తన పురోగతియం దెన్నో ఉపరాగములు, ఎదురు నడకలు, పునః పాకములు నున్నవని ఎరుగనేర దది. మానవ సభ్యతా మహేతిహాసమునందు, ఒక్క సభ్యతదే కాదు, ఎన్ని సభ్యతల చరిత్రలో అందు పెనవేసికొని యున్నవి.

---

# 4

## సత్యాగ్రహ సమరారంభము

పాశ్చాత్యులది పురోగమనమే యని మనము నిరూపించకయే గాంధి వ్రతమునకు భిన్నముగా లోకము నడచుచున్నది గదాయని ఆయన విశ్వాసములు కూలిపోవుట తథ్యమని యెంచకూడదు. ప్రాచ్యదేశీయుల మనస్థైర్యము నెరుగని వారు మాత్రమే అట్లెంచు కొందురు. గోబినో చెప్పిన మాటలు వినుడు. "ఆసియా వాసులకు మనకంటె నన్నిట బట్టుదల యధికము. తమ ఆశయ సిద్ధికై వారెన్ని పురుషాంతరముల వరకైన వేచియుందురు. ఎంతకాలము గడచినను వారి ఆశయములు సన్నగిలక పుష్టిమంతములగును." భారతీయులు శతాబ్దులు గడచిపోయెనని భీరువులుగారు. గాంధికి తన యత్న మొక్క సంవత్సరములో ఫలించినచో సంతోషమే. అట్లుకాక వేయేండ్లకు ఫలించినను సంతోషమే. కాలము నాయన తొందరపెట్టదు. కాలము మందగతి యగునేని ఆయనయు మందగతినే తాల్చును. తాను తలపెట్టిన తీవ్ర సంస్కారములను భారతదేశము గ్రహింపక, అందులకు సిద్ధపడక యుండునేని ఆయన ఆచరణ యోగ్యమగు మార్గాంతరము నవలంబించును. యంత్రముల పాలిటి ఈ పరమ విద్వేషి 1921లో చెప్పిన యీ క్రింది మాటలు మన కాశ్చర్యమును గూర్పజాలవు.

"ఈ యంత్రము లన్నియు రూపుమాసి పోయినచో నేను చింతింపను. అట్లని, ఈ యంత్రముల యెడ నాకు ప్రత్యక్ష విరోధము లేదు."

"అపవాదములు, హద్దులులేని పరిపూర్ణాహింసయే నా పరమ ధర్మము. అట్లని, నాకు నచ్చిన లోకవ్యవహారము లన్నిటిని ఈ ధర్మమే పాలింపవలెనని నేను కోరను...... అట్లు చేసినచో మనము అపజయమును, తిరోగమనమును ముందే తెచ్చిపెట్టికొన్న ట్లగును. జనసామాన్యము త్రికరణముల నీధర్మము నాచరించు ననుకొనుట అవివేకము..."

"నేను గొంతెమ్మ కోరికలు గోరను. సాధక బాధకములు విచారించక ఆకాశ సౌధములు నిర్మింపను." గాంధి తన్నుగూర్చి చెప్పికొన్న యీ మాటలు యథార్థములు. ప్రజల శక్తికి మించిన కోరిక లాయన కోరడు. శక్తివంచన సేయవలదని కోరును. భారతదేశ మందలి కోట్లకొలది జన సంఖ్యను, పరంపరాగతమగు అచటి సంప్రదాయ సంపదను, ఆత్మవికాస సంపదను విచారించినచో, గాంధి కోరిన యీ కోరిక తక్కువది కాదు. భారత ప్రజలకు, గాంధికి మొదటినుండియు మనసులు కలిసినవి. బాహ్యప్రకటనలు లేకుండగనే వారొకరి నొకరు గ్రహించుకొనిరి. ప్రజ లేమి యీయగలరో గాంధి యెరుగును. గాంధి యేమి కోరునో ప్రజలు నెరుగుదురు. స్వరాజ్య మనెడి భారత స్వ పరిపాలనమే ఆ యుభయులను కట్టివేసిన ప్రధాన బంధము.

"ప్రజల లక్ష్యము స్వరాజ్యమే గాని అహింస కాదని నే నెరుగుదును," అనెను గాంధి. అంతియే కాదు; మనకు

రిచ్ఛపా టొాదవించు ఈ క్రింది పంక్తులు చూడుడు.

"తమ్ము బీల్చుకొను తినువారి హింసకు బాల్పడి, దాస్యబంధముల జిక్కి యుండుటకంటె హింసచే ఆ బంధము నుండి విడివడుటయే భారత ప్రజలకు మేలని యెంతును." వెంటనే దీని నాయన యిట్లు సవరించుకొనెను. "అట్టిది సాధ్యమగునా? హింసచే భారతదేశ మెన్నటికి విడివడ జాలదు. ఆత్మబల మొక్కటే భారతమునకు సముచిత సాధనము. సత్యాహింసలే ఆబలము. దాని పేరే సత్యాగ్రహము. అది వినా, స్వరాజ్యము సిద్ధింపదు."

ఆ ప్రబలాయుధ స్వరూపమును, అందు గుప్తమై యున్న శక్తిని గాంధి ప్రజలకు ప్రత్యక్ష మొనర్చెను. ఆయన ఉపజ్ఞా ప్రభావ మిదియే.



సత్యాగ్రహమను మాటను గాంధి దక్షిణాఫ్రికా యందే కల్పించెను. తనది నిష్ప్రతిక్రియానిరోధము లేక సాత్విక నిరోధము (Passive resistance) కాదని చెప్పుటకీమాటను కల్పించెను. గాంధి యుద్యమమును ఐరోపీయులు "నిష్ప్రతిక్రియ" మనియు, "ఉపేక్షానిరోధ" మనియు వర్ణింపసాగిరి. తన యుద్యమము తద్భిన్నమని ఆయన చెప్పవలసివచ్చెను. గాంధిది ఉపేక్ష యెన్నటికిని కాదు. నిరోధకులలో గాంధి వీరాగ్రేసరుడు. శాంతి యెఱుగని వీర మాయనది. ఉపేక్షకు గాంధికి గానివావి. ఉపేక్ష యున్నచో గాంధి కున్నంత ఏవము మరొకరి కుండదు. ప్రత్యక్ష ప్రతిఘటనమే ఆయన

యుద్యమమునకు ప్రాణము. అహింసాత్యాగములు, విశ్వాసము ఆ ప్రతిఘటన నుద్దీపింపజేయును. త్రిగుణాత్మకమగు ఈ శక్తియే సత్యాగ్రహము.

తమ భీరుత్వమును గాంధి మరుగున మాటుకొనగోరు పిరికిపంద లాయన చెంతకేగకుడు. గాంధి తన సంఘమునుండి పందలను తరిమివేయును. ఈ పిరికిపంద కంటె హింసా స్వభావుడే మేలు.

"హింసా భీరుత్వములు రెంటిలో నేను హింసనే వరింతును. ఎదిరిని చంపకుండ చావగల నిశ్చల ధైర్యమునే నేను సాధింతును. ఇట్టి ధైర్యము లేనివాడు చంపుటయో, తాను చచ్చుటయో నేర్చుకొనవలెను. అంతియేకాని ఆపద వేళ సిగ్గుమాలి పారిపోవుట తగదు. ఏలయన, అట్లు పరుగిడుటయు మానసిక హింసాచరణమే. చచ్చుటకు దెగువ లేకయేకదా పారిపోవుట...భారతజాతి పౌరుషహీన మగుట కంటె హింసాచరణమే మేలని యెంతును......మరి, హింస కంటె అహింసయే మహోత్తమమని నే నెరుగుదును. దండించుటకంటె క్షమించుటయే పురుషలక్షణము. దండింపగల్గియు సైరించుటయే క్షమ యగునుగాని వట్టిసైరణ సైరణ గాదు. భారతము శక్తిహీనమని ఎంచను నేను. కొన్ని వేలమంది ఆంగ్లేయులు ఇన్నికోట్లమంది మనుష్యులను భయపెట్ట జాలరుకదా?......శక్తి యన్నచో బాహుబల మొక్కటే కాదు. దుర్దమమగు ఇచ్ఛాశక్తియే శక్తి...... కనికరముమై పాపకర్మకు దలయొగ్గుట అహింస కానేరదు. క్రూరుడగు పాలకుని యిచ్ఛకు అహింస ఆత్మబల సర్వస్వము

నెదురొడ్డును. మహాసామ్రాజ్యము నేనియు ఒక్క పురుషు డీ విధముగా ప్రతిఘటించి దానిని కూల్చగలడు."

ఈ విజయమునకై దేని నొడ్డుచున్నా డతడు? బాధా సహిష్ణుతను. బాధాసహనమే కదా పరమ ధర్మము.

"మృత్యువు లేనిచో బ్రతు కెక్కడిది? బీజనాశ మందేకదా సస్యవృద్ధి. బాధాసహన మను ఈ ప్రాయశ్చిత్తము శాశ్వత ధర్మము. ఈ ధర్మము నాచరింపని వానికి అభ్యుదయాశ లేదు.........బాధాసహన మెంతయో పురోగమన మంత. బాధాసహనమే పురోగతికి కొలతబద్ద. ఆ బాధాసహనము పవిత్రమగు కొలది పురోగతియు నధిక మగును......ఎదుకమై సహించుటయే అహింస...... బాధాసహన రూపమగు ఈ యజ్ఞము సనాతన భారత ధర్మము. దీనినే భారతీయులకు నే నుపదేశించునది. హింసా ప్రవృత్తి మధ్యమున అహింసను దర్శించిన ఋషులు న్యూటనుకంటె అధికోపజ్ఞామహితులు, వెల్లింగ్టను కంటె వారు గొప్ప వీరులు. శస్త్రాస్త్రముల నెఱిగియుండియు అవి వ్యర్థములని యెంచి వారు విడనాడిరి... ఈ యహింసా ధర్మము ఋషులకు, యోగులకే కాదు. మానవ సామాన్యమంతటికి నది ఆచరణీయమే. హింసా ధర్మము మృగజాతికి, అహింస మానవ జాతికి, మృగములలో ఆత్మ నిద్రించుచున్నది. ఉత్తమ మగు ఈ యాత్మ ధర్మమును తల దాల్చుటయే మానవుని ఉత్తముని, ఉన్నతుని గావించగలదు......భారత మీ యహింసా

ధర్మము నవలంబించు గాక! ఈ ధర్మమందున్న బలాధిక్య మును భారతము పూర్ణముగా గ్రహించు గాత! భారతము నకు నాశములేని ఆత్మ యున్నది. ఈ యాత్మ లోకమందున్న సర్వ భౌతిక శక్తులను తృణీకరింప గలదు......భారత దేశ మీ యాత్మ బలము నేనాటికి గుర్తింప నేరదేని హిమాలయము లందే కాంతవాసమే నాకు శరణ్యము..............."
(6–4–1921)

ఆయన యెన్నడు నిరాశ చెందడు. 1918 లో కర్షక వివాదలందు ఈ సత్యాగ్రహాయుధమును తాను చక్కగా పరీక్షించి చూచెను. కావున 1919 ఫిబ్రవరిలో భారత దేశ మును నమ్ముకొని జైత్ర యాత్ర నారంభించెను.

రాజకీయమగు తిరుగుబాటును గూర్చిన ఆలోచన మప్పు డాయనకు లేదు. గాంధి అప్పటికింకను రాజభక్తుడే. ఇంగ్లండుపట్ల విశ్వాసలేశ మున్నంత కాలము ఆయన అను రక్తుడుగానే యుండును. 1920 జనవరి వరకు ఆయన సామ్రాజ్యముతో సహకరింపవలెననియే వాదించు చుండెను. భారత దేశభక్తు లందులకు గాంధి నాడిపోసికొనిరి. భారత ప్రభుత్వమును ప్రతిఘటించిన ఆ మొదటి వత్సరమున సత్యా గ్రహులందరు రాజశాసనమునకు సర్వథా విధేయులుగా నుందురని హంటరు ప్రభువుతో గాంధి నమ్మకముగా జెప్పెను. భారత భూమికి ధర్మమార్గోపదేశకుడైన యీ రాజభక్తుడు తన అనురక్తి బంధమును చేసేత త్రెంచి వేసికొన వలసి వచ్చెనన్నచో, దానికి అప్రగల్భ భారత ప్రభుత్వపు మొండి పట్టు గాక మరియొకటి కారణము గాదు.

అన్యాయ్య శాసనము చేసిన భారత ప్రభుత్వమును శాసన బద్ధముగానే ఎదుర్కొనుటకు ఇట్లు సత్యాగ్రహ మారంభమయ్యెను. సత్యాగ్రహులు సహజముగా శాసనాను వర్తులే అయ్యు, అక్రమ శాసనములను వారు ప్రయత్న పూర్వకముగ నెదిరింతురు. ఆ యన్యాయ్య మంతటితో తొలగదేని ప్రభుత్వముతో సర్వవిధ సహకారమును మాను కొనుటకు గూడ వారు ఆ యత్తులై యుందురు. పాశ్చాత్యు లూహించు శాసన ధిక్కృతికి దీనికి నెంత యంతరమున్నదో చూడుడు! అసాధారణమగు ధర్మ వీరమున కిం దెంత ప్రాధాన్యమున్నదో గమనింపుడు!

సత్యాగ్రహులు ప్రతిపక్షుల చిత్తశుద్ధిని శంకింపరు; కనుక నే వారిపై చేయిచేసుకొనుట సత్యాగ్రహులకు నిషిద్ధము. మనకు ధర్మముగా దోచినది ఎదుటివారి కధర్మముగా దోచవచ్చును. కావున హింసచే వారి మనస్సులను ద్రిప్పుట ఎన్నడును బొసగదు. సత్యాగ్రహులు తమ విశ్వాసబల ముచే వెలుగు ప్రేమదీప్తిచేతను, స్వసుఖ వర్జనముచేతను, హర్ష ప్రమోదములతో బాధల ననుభవించుట చేతను ప్రతి పక్షులను జయింపజూతురు. ఇట్టి ధర్మప్రచారము నరికట్ట గల్గుట దుర్ఘటము గదా! శిష్య బృందముతోగూడ క్రీస్తు అనుభవించిన యిట్టి బాధాసహన ప్రచారమే తొల్లి సామ్రాజ్యమును గూలద్రోసినది. స్వాతంత్ర్యము కొఱకు, న్యాయ్యముకొఱకు బలిగానున్న యీ ప్రజల ధర్మోత్సాహ

మును విశదమొనర్చుటకు 6-4-1919 న భారతదేశ మంతట ప్రార్థనోప వాసములతో హర్తాల్ జరపవలెనని గాంధి విధించెను. ఇదియే ఆయన మొదటి చర్య. ప్రజల అంతరంగమును ఈచర్య మొదలంట కరగించెను. ఎన్నడు అనుకొనని ఫలితము దీనిచే కలిగెను. అన్ని తరగతుల భారతప్రజలు నొక్కుమ్మడి నేకీభవించుట కిదియే మొదలు. భారత మపుడు తొలిసారిగా స్వస్వరూపమును దర్శించెను.

దేశమంతయు శాంతముగ నున్నదనియే చెప్ప వచ్చును. ఒక్క డిల్లీ నగరమున గొంత యలజడి ప్రవర్తిల్లెను. ప్రభుత్వ మాయనను మార్గమధ్యమున రైలులో నిర్బంధించి బొంబాయికి త్రిప్పి పంపెను. గాంధి నిర్బంధ వార్త పాంచాలమున సంక్షోభము పుట్టించెను. అమృతసరమున హత్యలు, దొమ్ములాటలు జరిగినవి. 11-4-1919 రాత్రి డయ్యరు సేనాని ససైన్యుడై వచ్చి, ఆ నగరము నాక్రమించి శాంతి నెలకొల్పెను. 13-4-1919 హిందువులకు పండుగ దినము. ప్రజ లానాడు జలియన్వాలాబాగులో గుములు గూడిరి. స్త్రీలు పిల్లలతో గూడ నచట జేరిరి. ఎట్టి అలజడియు లేక శాంతముగా నుండెను. క్రిందటి రాత్రి డయ్యరు సేనాని ప్రజల సమావేశముల నెల్ల నిషేధించెనట. ఆ నిషేధ మెవ్వరు నెరుగరు. డయ్యరు మరతుపాకులతో జలియన్వాలాబాగు కేతెంచెను. అట్లు వచ్చిన ముప్పది నిమిషములకు, ఎట్టి హెచ్చరికయు సేయకయే, నిరాయుధమగు ఆ ప్రజల గుంపుపై తుపాకిగుండ్లు ప్రేలజొచ్చెను. పది నిమిషములు కురిసిన మీదట తుపాకిమందు వట్టిపోగా, అగ్ని

వర్ష మంతమయ్యెను. ఆ 'బాగు' (తోట) చుట్టు నెత్తయిన గోడలున్నవి. తప్పించుకొని పారిపోవుటకు దారిలేదు. అయిదారు వందలమంది భారతీయు లసువుల బాసిరి. ఇం కెందరో గాయపడిరి. వ్రణితులను, మృతులను గూర్చి విచారించిన వారు లేరు. పిమ్మట సైనిక శాసనమును చాటించిరి. కఠోర దండముచే పాంచాల మంతయు నట్టుడికి పోయెను. నిరాయుధ ప్రజాసమూహములపై విమానము లగ్ని గోళములను వర్షించెను. సమ్మాన్యులగు పాంచాల పౌరుల నెందరినో సైనిక కోర్టుల కీడ్చి, కొరడాలతో మోదిరి. పొట్టలపై ప్రాకించిరి. పరాభవములకు బాల్పరచిరి. భారత దేశ మహింసను చాటించు టేమి! యూరపులోని హింసాబుద్ధుల కంతట ఒడలెరుగని యీ సివములు, చిందులు నేమి? ఆంగ్ల పాలకులలో బుద్ధిహీనతా వ్యాధి అంటురోగమై వ్యాపించెనేమో! ఇది యిట్లు జరుగునని గాంధి యెరుగక పోలేదు. ప్రజలను ముండ్లులేని మెత్తని బాటలవెంట నడపి జయము గూర్తునని ఆయన యెన్నడు వారి కాసపెట్టలేదు. జలియన్వాలాదినము భారతప్రజ కిట్లు కనువిప్పు పండుగ ఆయెను.

"మనము లోకమున ఇతర ప్రజల కెవ్వరికి దీసిపోక, వారితో సరిగద్దె నుండవలె నన్నచో, నిరపరాధ ప్రజావధ లిట్టివి ఒక వేయిగాదు, ఎన్ని వేలేని జరుగుగాక, వానినెల్ల సమచిత్తులమై భరించుట కాయత్తులము కాకతీరదు. ఉరి కంబ మెక్కుట ఎల్లరకు నిత్యకృత్యమై పరిపాటి గావలెను."
(7-4-1920)

ఈ పాంచాల ఘోరకృత్యముల వార్త బయటికి

పోక్కుండ సైనికాధికారులు అదుపు చేయగల్గిరి. * క్రమ ముగా నొక్కొక్క వార్తయే బయటికి జారదొడగినంతట భారత దేశమున క్రోధవాయువులు వీవజొచ్చెను. ఇంగ్లండులో గూడ కదలిక పుట్టెను. హంటరు ప్రభువు నాధిపత్యమున విచారణ కలాపమును ప్రభుత్వ మారంభించెను. భారత కాంగ్రెసు దీనికి బ్రతిగా స్వతంత్ర విచారణకు మొదలిడెను. అమృతసర హత్యాకాండ కర్తల నందరిని దండించుట ప్రభుత్వమునకు క్షేమకారి అయ్యేడిది (బుద్ధిశాలురగు ఆంగ్లేయు లెల్లరు నిది యెరుగుదురు). అట్టి దండనమును గాంధి కోరలేదు. ఆ సహనము నెంతని మెచ్చుకొందును! డయ్యరు సేనానిని, ఇతరాపరాధులను దండింపుడని గాంధి కోరడయ్యెను. ఆయనకు రోషముగాని, ప్రతీకార చింతగాని లేదు. డయ్యరు నీదేశమునుండి పంపివేసిన చాలుననెను. కాని "తా జెరుపదలచినవారి నీశ్వరుడు మతిభ్రష్టుల నొనర్చునట" కదా!......విచారణ కాండ ముగియక మునుపే భారతప్రభుత్వము తన యుద్యోగుల కెట్టి హానియు కలుగకుండ శాసనమును నిర్మించెను. అపరాధులగు ఆ యుద్యోగులకు పదభ్రష్టత కలుగకపోగా పసదనములు గూడ ప్రాప్తించెను.

## ౩

భారతదేశ మీా సంకటావస్థలో నుండగనే ఇంత కంటె దారుణమగు ఘటన యొకటి జరిగెను. బ్రిటిషు

* విప్లావకు లిదే యదనని చెలరేగకుండ గాంధి 18-4-1919 న తన యుద్యమము నుపసంహరించుకొనెను.

ప్రభుత్వాధినేత భారతమునకు తా నొసగిన పవిత్ర వాగ్దానమును ఘోరముగ భంగపరచెను. యూరోపియనుల యెడ భారతీయుల కేమాత్రమైన నమ్మక మున్నచో దీనితో ఆ కొంచెమును చెడిపోయెను.

ఐరోపా యుద్ధకాలమున భారతీయ ముసల్మానుల కొక ధర్మసంకటము వచ్చిపడినది. ఇస్లాము మతాచార్యుడగు టర్కీ సుల్తానుపట్ల గురుభక్తి, బ్రిటిషు సామ్రాజ్యము నెడ రాజభక్తి—యీ రెంటి మధ్యమున వారి చిత్తము లూగులాడ జొచ్చెను. "మీ కాలిఫ్-టర్కీ సుల్తాను-ప్రభుత్వమునకు భంగము చేయము" అని బ్రిటిషు ప్రభుత్వము మాట యిచ్చిన పిమ్మటనే వారు ఇంగ్లండు నభిమానించిరి. యూరపు నందున్న టర్కీ తురుష్కుల అధీనమందే ఉండవలెననియు, ముసల్మాను క్షేత్రములతోపాటు మెసపటేమియా, సిరియా, పాలస్థానములతో గూడిన అరేబియాను గూడ సుల్తానే అధినేతగా నుండవలెననియు ముసల్మానులు కోరదొడగిరి. లాయిడ్ జార్జి మహామంత్రియు, భారత వైస్రాయియు యథావిధిగా వారికి మాట యిచ్చిరి. యుద్ధము ముగిసినంతట ఈ వాగ్దానమును మరచిరి. 1919 వేసవిలో వెలువడిన సంధి షరతులలోని దారుణావమానము ముసల్మానులకు కలవరము గల్పించెను. ఖిలాఫత్ ఉద్యమమున కిదే మొదలాయెను. 17-10-1919న ప్రశాంత గంభీరముగ ముసల్మానులు తమ రోష సంతాపముల బ్రకటించిరి. పిమ్మట నొక నెలకు భారత ముసల్మాను లందరును ఢిల్లీలో సభగూడిరి. ఆ సభకు అధ్యక్షుడు గాంధి. హిందువు

లను, ముసల్మానులను ఏక మొనర్చుట కిదియే అదనని ఆయన సూక్ష్మబుద్ధికి దోచెను. ముసల్మానుల కది ప్రాణపదమగు మత సమస్య. హిందూ ముసల్మానుల సహజ వైరమును బ్రిటిషు ప్రభువు లిన్నాళ్లు రెచ్చగొట్టుచుండిరి. మొద లీ వైరము నాంగ్లేయులే చాలవరకు కల్పించిరని గాంధి యభిప్రాయము. కల్పించుట మాట యెటులున్నను ఆ వైరమును వారెన్నడు తగ్గించిన పాపమున బోలేదు. ఈ యుభయ మతస్థులకు దరచు జగడములు దాపరించుచుండెను. ముసల్మానుల ప్రశాంతికి భంగముగా మసీదులముందు హిందువులు మేళతాళములు చేయగా, హిందువుల గోభక్తికి ముసల్మానులు భంగము గూర్పక మానినదియు లేదు. ఇవియే కలహకారణములు, ఈ కలహములచే విరోధములు ప్రబలిపోయెను. ఈ యుభయ ప్రజలకు పరస్పర సాంగత్యము లేదాయెను. వీరికి పరస్పర వివాహములు, భోజన ప్రతిభోజనములు నిషిద్ధములు. ఈ విరోధములను నమ్ముకొని ప్రభుత్వము గుండెపై చేయినిడుకొని నిదురించుచుండెను. ఖిలాఫత్ సభలో గాంధి ఐకమత్య ప్రకటన చేయగనే ప్రభుత్వము దద్దరిలి లేచెను. ఖిలాఫతు విషయమున హిందువులు ముసల్మానులతో నేకీభవించి ఆదుకొనవలెనని గాంధి సహజౌదార్యపూర్వకముగ ప్రకటించెను.

"హిందువులు, పారసీకులు, క్రిష్టియనులు, యూదులు వీరందరు ఏక ప్రజగా మనదలతు రేని ఒకరి కష్టసుఖము లందరివిగా నెంచుకొనక తీరదు. పోరాటము ధర్మ్యమా, కాదా యనున దొక్కటియే మనము తేల్చుకొనవలసినది."

అమృతసర సంహారమందు ముస్లిము రక్తము హైందవ రక్త ముతో గలియనే కలసినది. ఇక దృఢసఖ్యముచే వీరిని బంధింపవలసి యున్నది. ఆ సఖ్యమునకు పరతు లేవియు నుండరాదు. భారత ప్రజలలో మహమ్మదీయులే మిగుల గట్టివారు. ఆ ఖిలాఫతు సభలో మహమ్మదీయులే ముందుగా సహాయ నిరాకరణమునకు నిశ్చయించినవారు. గాంధి అందు లకు వల్లెయనెను. ఇంగ్లీషు సరకులను ఆంక్ష పెట్టుటకు మాత్ర మాయన సహజౌదార్యము సమ్మతించినదికాదు. అట్టి యాంక్ష దౌర్బల్యమునకు, ప్రతీకార వాంఛకు చిహ్న మని చెప్పి యాయన దానిని త్రోసిపుచ్చెను.

1919 చివరి భాగమున రెండవ ఖిలాఫతుసభ అమృత సరమందే జరిగెను. అందు ఇంగ్లండుకు రాయబార మంప నిశ్చయము సల్పిరి. సంధి మహాసభలో భారతీయుల అభీష్ట మును కాలద్రొక్కరేని అది విషమముగా బరిణమించునని వైస్రాయికి హెచ్చరిక సలుపుటకు గూడ నిశ్చయించిరి. 1920 ఫిబ్రవరిలో బొంబాయి యందు మరియొక సభ జరి గెను. అందు ఆంగ్ల రాజనీతి నాక్షేపించుచు, విపత్తు మూడ నున్నదని హెచ్చరించిరి.

౪

ముంచుకొనివచ్చు ఆ విపత్తును గాంధి కనులార గాంచి, దాని నరికట్టుట కెంతో పెనగులాడెను. ఇంగ్లం డులో గూడ కనువిప్పు గలుగ నారంభించెను. విప న్నివార ణోపాయము లించు కించుకగా ప్రభుత్వము చేయసాగెను.

మాంటేగూ చెమ్సు ఫర్డుల సలహాల ననుసరించి భారత రాజ్యాంగ సంస్కరణము జరపిరి. భారత ప్రభుత్వమునను, రాష్ట్రపాలనము నందును ప్రజల కెక్కువగా అధికార మిచ్చు ఆ సంస్కరణములకు 24–12–1919 న ఆంగ్ల సమ్రాట్టు సమ్మతించుచు ప్రకటన యొకటి చేసెను. ప్రజలు, నధికారులు అందులకు సమ్మతింపుడని అందు సమ్రాట్టు విన్నపము చేసెను. రాజకీయములకై చెర పెట్టిన వారి నంద రిని విడుదల చేయవలసినదని వైస్రాయికి ఆజ్ఞ యొసగెను. మంచితనమున కిట్టె ద్రవించిపోయెడి గాంధి ఆ సంస్కరణము లకు సమ్మతింపుడని భారత ప్రజలకు సలహా యిచ్చెను. అవి అసమగ్రము లయ్యును ముందు ముందు సమగ్ర సంస్కరణ లకు దారితీయగలవని ఆయన అభిప్రాయము. కాంగ్రెసు సభలో వాద ప్రతివాదములు సాగినవి. తుదకు గాంధి మాటయే నెగ్గెను.

కాని ఈ తుది యాసకు గూడ భంగమే వాటిల్లెను. చెరనున్న వారినందరిని వైస్రాయి విడిచిపుచ్చక, వారిలో చాలమందిని ఉరికంబ మెక్కించి, భారతక్రోధాగ్ని కింధన ములు దరికొల్పెను. అంతటితో ఆ సంస్కారములు వట్టి బూటకమని తెలిసివచ్చెను.

ఇంతలో 14–5–1920 నాటికి సంధి సభలో టర్కీకి కలిగిన తలవంపులు భారత ప్రజలకు తెలిసెను. ఆ సంధి ముసల్మానులకు సంతాపకరమైనను, అందులకు దలయొగ్గ దగునని వైస్రాయి విన్నప మొనర్చెను.

అమృతసర దురంతముల విచారణ కలాపము గూడ

అప్పటికి ముగిసి ఆ పర్యవసానము బయటపడెను. భారత హృదయమునకు దానితో చిచ్చుపెట్టి నట్లయినది.

ఇక నేమున్నది? కార్యము పాకము దప్పినది. తెగ త్రెంపులు పూర్తియైనవి. 28–5–1920 న ఖిలాఫతు సంఘము గాంధి చెప్పిన సహాయ నిరాకరణము నామోదించెను. 30–6–1920 న అలహాబాదులో హిందూ ముస్లిము మహాసభ గూడ అదియే నిశ్చయించెను. వైస్రాయి కిరువది నాళ్ల గడువిచ్చి హెచ్చరిక నంపిరి. సహాయ నిరాకరణమును దా నేల నిశ్చయించెనో తెలుపుచు వైస్రాయికి గాంధి లేఖ నంపెను. అందు ఆయన చెప్పిన కారణము లెంతయు గణనీయములు. ఇప్పటి కేనియు ఇంగ్లండుతో తెగత్రెంపులు చేసికొనగోరననియు, ఇంగ్లండుకు పశ్చాత్తాపము కల్గుగాక యనియు, శాసన సమ్మత చర్యలకే తాను గడంగుదుననియు గాంధి ఆ లేఖలో హెచ్చరించెను.

"నేటి రాజ్యాంగ పద్ధతులలో ఇంగ్లండుది సర్వోత్తమమను నమ్మకము నా కింకను ఉన్నచో నేటి అన్యాయ్యమును బరిహరించి, ఆ నమ్మకమును బ్రదికించుటో, లేదా, ఇంగ్లండుతో తెగత్రెంపులు చేసికొనుటో తప్ప నావంటి వానికి మరియొక మార్గము లేదు. ఆ నమ్మకము నా కింకను పోలేదు గనుకనే ప్రజలకు శాసన ధిక్కారము నుపదేశించితిని."

ఇంగ్లండు తన దుర్గర్వముచే నెట్టి సామ్రాజ్యభక్తుని గోల్పడెనో స్పష్టమైనది కదా!

---

# 5

# సహాయ నిరాకరణోద్యమము

1–8–1920 న సహాయ నిరాకరణ మారంభింపవలె ననియు, అంతకు బూర్వదినమున బ్రజలందరు ఉపవసించి, ఈశ్వర ప్రార్థన మొనర్చి సంసిద్ధులు కండనియు 28–7–1920 న గాంధి ప్రకటించెను. ప్రభుత్వ మాగ్రహించుననను చింత ఆవంతయు గాంధికి లేదు గాని ప్రజలు వశముతప్పుదు రేమో యని భయపడెను. కావున అందుకు వలయు కట్టుదిట్టము లొనర్చెను.

"సహాయ నిరాకరణము ఫలింపవలెనన్నచో నియమ పూర్వకమగు సంఘటన ముండవలెను. నియమ భంగము నకు క్రోధమే కారణము. హింసను పూర్తిగా పరిహరింప వలెను. హింస యెపుడును వెనుకంజకు గారణమై, నిరప రాధులకు వృథా ప్రాణనష్టము చేయును........ప్రజ లందరు కట్టు దప్పకుండుటయే అన్నిటికంటె ముఖ్యము."



అప్పటికి రెండు నెలలనుండియు సహాయ నిరాకరణ సంఘముతో గలసి గాంధి ఉద్యమ కార్యక్రమము నిట్లు నిర్ణయించెను :

1. బిరుదులను, గౌరవోద్యోగములను వదలుకొనవలెను.
2. ప్రభుత్వమునకు అప్పు లీయగూడదు.

3. లాయర్లు తమ వృత్తిని నిలిపియుంచి, సివిలు వివాద లందు మాధ్యస్థ్యము చేయవలెను.
4. ప్రభుత్వ పాఠశాలలకు పిల్లలను బంపగూడదు.
5. క్రొత్త శాసన సభలను బహిష్కరింపవలెను.
6. ప్రభుత్వపు విందు భోజనములకు, పేరంటములకు బోగూడదు.
7. సివిలు మిలిటరీ ఉద్యోగము లిచ్చినచో గ్రహింప రాదు.
8. 'స్వదేశీ' ప్రచారము. అనగా, ఇందలి నిషేధములకు ప్రత్యామ్నాయముగ చేయవలసియున్న నూతన భారత సృష్టి. దానిని గూర్చి పిమ్మట వివరింతును.

ఇది మొదటి మెట్టు మాత్రమే. అపారమగు ఈ తిరుగుబాటు యంత్రమునకు చోదకత్వము వహించిన యాయన ఉచితజ్ఞతయు, దూరదృష్టియు గణనీయములు. పాశ్చాత్య విప్లావకుల కివి అచ్చెరువు గూర్చును. ఈ యుద్యమమున శాసనధిక్కారము (Civil Disobedience) లేనే లేదు. శాసనధిక్కారమును గూర్చి గాంధి థోరూ గ్రంథములను పరిశీలించెను. తన వ్రాతలయందు వాని నుదాహరించెను. ధిక్కారమనగా కేవలము అవిధేయతగాదు. "ధిక్కారమనగా శాసన భంగము. అది ఏ కొందరికో సాధ్యమగును. సహాయ నిరాకరణము సర్వులు ఆచరింపదగినది, ఆచరింపవలసినది." ప్రజలకు శాసన ధిక్కారమును నేర్పవలెననియే గాంధి అభిలాష. ఒక్కొక్క మెట్టుగా ప్రజల నందుల కాయత్తుల చేయనెంచెను. ప్రజ లందుల కింకను తగరని ఆయన యెరు

గును. కావున కళ్లెమును బిగబట్టి యుంచెను. ప్రజల కాత్మ సంయమము కుదిరినదను నమ్మకము కుదరకముున్నే కళ్లెమును సడల్చుట గాంధి యభిమతము కాదు. కావున ఈ సహాయ నిరాకరణ ప్రథమదశలో పన్నుల నిరాకరణమును చేర్పక గాంధి అందులకు తరి వేచి యుండెను.

౨

ఆగస్టు 1 వ తేదీన గాంధి వైస్రాయి కొక లేఖ నంపి, ఉద్యమము నారంభించెను. ఆ లేఖ ప్రసిద్ధి కెక్కినది. ఆ లేఖతో గూడ తన బిరుదులను, పదకములను త్రిప్పి పంపెను.

"దక్షిణాఫ్రికాలో నాచేసిన సేవకు వెనుకటి వైస్రాయి బహూకరించిన 'కైజరి హిందు' పదకమును, జూలూ యుద్ధములో ప్రణితోపచార దళపతినై నేను పొందిన పదకమును, 1899-1900 బోయరు యుద్ధములో ప్రణిత వాహకదళ ఉపాధి పతినై నేను పొందిన పదకమును మీకు త్రిప్పి పంపుచున్నాను. ఈ పంపుటలో నాకు బాధ లేకపోలేదు." పిమ్మట పాంచాల మారణకాండను, ఖిలాఫతు పరాభవ పర్వమును ప్రస్తావించి పిదప నిట్లు వ్రాసెను. "ఇట్టి అవినీతిచే, అన్యాయ్యముచే కళంకితమైన ప్రభుత్వముపట్ల అనురక్తియు, గౌరవమును నేను వహింపలేను..... ఆ ప్రభుత్వము తప్పు దిద్దుకొనక తప్పదు." ప్రజలతో సంప్రదించి, వెనుకటి అన్యాయ్యములను, అపరాధములను సవరించు

కొని, పరిహారము కల్పింపవలెనని కూడ గాంధి ఆ లేఖలో వ్రాసెను.

గాంధి చూపిన దారివెంట దేశమున వందలాది లాయర్లు, న్యాయాధిపతులు తమ వృత్తులను, పదవులను విసర్జించిరి. వేలకొలది విద్యార్థులు కళాశాలలను వదలిరి. ప్రజలు కోర్టులను బహిష్కరించిరి. పాఠశాలలు వట్టి పోయెను. కలకత్తాలో భారత కాంగ్రెసు విశేష సమావేశము జరిపి గాంధి చర్యలను ఆమోదించెను. మిత్రుడగు మౌలానా షౌకతాలీతో గాంధి చేసిన దేశ సంచారమున ప్రజోత్సాహము మిన్నుముట్టెను. ఆ యుద్యమారంభ మాసములలో ప్రకాశించినట్లు గాంధి నాయకత్వ నైపుణ్యము మరొకపుడు ప్రకాశింపలేదు. హింసాకాండ జరుగకుండ అదుపు సేయవలెను. అల్లరి మూకల అరాజకచర్యలన్న గాంధికి రోత. ఆతతాయుల దౌరతనమన్న ఆయనకు బొత్తిగా గిట్టదు. * భారతమున కట్టి దౌరతనము విపత్కారణమని ఆయన యెంచెను. యుద్ధమన్న ఆయన కున్నంత రోత మరియొకరి కుండదు నిజమే కాని ఈ నరమాంస భక్షకుల స్వైరవిహారము కంటె ఆయన యుద్ధమే మంచి దనును. "భారత స్వాతంత్ర్య సిద్ధికి హింసయే శరణ్యమగునేని ఆ హింస నియమ పూర్వకము, గౌరవప్రదము కాదగును. అంతియే కాని అల్లరిమూకల యాగడము మన కే నాటికి వలదు."

* ఈ దౌరతనమునే కౌరల్ మార్క్సు 'వయోక్రొటి' యనెను.

సంతోష కోలాహల ప్రకట మన్నను ఆయనకు సంశ యమే. అదికూడ హద్దుమీరి, ఆవేశోన్మాదములకు దారి తీయునని ఆయనకు భయము. "ఈ గందరగోళమునుండి నియమ పాలనమును రూపెత్తించ వలసి యున్నది. అల్లరి మూకల దొరతనము పోయి ప్రజల పాలనము రావలెను." పాశ్చాత్య ఖండమందును భక్తులు, ధర్మాచార్యులు, నియ తాత్ములు నున్నారు. సాధక బాధకములను, సాధ్యా సాధ్య ములను విచారించుటలో సూక్ష్మదర్శియగు ఈ మహాభక్తుడు వా రెవరికిని తీసిపోడు. కావుననే ప్రజల ఆవేశ కల్లోలము లను చక్కని దారులకు మరలించుటకై ఆయన కొన్ని నియమములు చేసెను.

"సంగీతమును మన మిన్నాళ్లు నుపేక్షించితిమి. ఛందో నియమము, లయ ఇదియే సంగీతము. సంగీతము సద్యః ఫల దాయిని. అట్టి సంగీతము కొలది మంది శిష్టులకు సొత్తయి పోవుట దురదృష్టము. సంగీత భాగ్యము ప్రజ లందరికి నెన్నడు పంచిపెట్ట మైతిమి. సులభములు, జనరంజకములు అగు కీర్తనలు కలసి పాడుట అందరు విధిగా నేర్చుకొన వలెను. దీనిని సాధించు నిమిత్తమై సంగీత విద్వాంసులు కాంగ్రెసు మున్నగు మహాసభ లన్నిటికి వచ్చి జనులకు బృందగానము నేర్పుచుండుట మంచిది."

ఇక శాంతి రక్షణ నియమములు :

1. పెద్ద పెద్ద ఉత్సవాది ప్రదర్శనలకు అశిక్షితులగు వలం టీర్లు పనికి రారు. సుశిక్షితులే వానిని నడపు చుండవలెను.

2. వలంటీర్లందరిచెంత శాంతి రక్షణ నియమావళి ఉండవలెను.
3. ప్రజా సమూహము వలంటీర్లు చెప్పినట్లు మెలగుచుండవలెను.
4. జయజయాది ఉత్సాహ శబ్దములను నిర్ణయించి, వానినుచ్చరించు సమయమును నిర్ణయింప వలెను.
5. ప్రజా సమూహములు రాచబాటల కడ్డముగాను, రైలు స్టేషనులోను గుమిగూడ దగదు.

ఇంత యెందుకు? ఆ మహా జనసమూహముల మేళతాళములు నడపు నాయకుడయ్యెను గాంధి. "ప్రజల ఆవేశోత్సవపు టూరేగింపులను కట్టుబాటులో నుంచుట అన్నిటికంటె కష్టమైన పని."

జన సమూహమున కప్పుడపుడు వెఱ్ఱి యావేశము వచ్చును. కట్టు దప్పిపోయి, శివమెక్కినట్లు హింసకు గడంగును. గాంధి ధర్మ స్వభావమును, రాజనైతిక మగు దాని పటిష్ఠతను కొందరు భారతీయులు గ్రహింపజాలక హింసానుకూల పక్షమును వహించిరి. హింసకు అడ్డు పడవలదని గాంధికి ఊరు పేరులేని లేఖలు రాజొచ్చెను. ఆ లేఖకుల కెంతటి సాహసమో?—గాంధి యహింసా వాదమంతయు శత్రువులను మోసపుచ్చుట కట—ఎంత అవమానకరమిది! ఆ మోసమును మాని, హింసకు ఆటవిడు పీయవలెనట! ఆ లేఖలను తీవ్రముగా మందలించుచు గాంధి ప్రత్యుత్తరము లిచ్చెను. హింసా మతమును ఖండించుచు గాంధి వ్రాసిన మూడు వ్యాసములును ప్రశంసనీయములు. వేదములు,

కొరాను గూడ హింస నొక్కనాటికి నుపదేశించ లేదనెను. హింసా ధర్మము నేమతము నుపదేశింప దనియెను. సాత్త్విక నిరోధకులలో ఏసుక్రీస్తు మకుటము వంటి వాడనెను. భగవద్గీతయు స్వధర్మాచరణమున ప్రాణమేనియు ద్యజింపుమన్నదే కాని హింస నుపదేశింప లేదనియెను.* మనుజుడు తాను ప్రాణిని సృష్టింప లేడు; అట్టి వానికి చంపు నధికారమెక్కడిది? శత్రువులను గూడ మనము ప్రేమింప వలెను. అట్లని పాపము నుపేక్షింప దగదు. డయ్యరు సేనానికే ప్రాణాపాయము వచ్చినచో ఆ సేనానికి ఉపచారములు చేయుటకు గాంధి సిద్ధమే. తన కొడుకే పాపకర్ముడగు నేని గాంధి వాత్సల్యము ఆ కొడుకు నాదుకొన నిచ్చగింపదు. ఆ కొడుకు మరణించినను సరియే. బలప్రయోగముచే పాపకర్మ నణచు నధికారము మనకు లేదు. అన్నిటికి దెగించి, ఆ పాపమునకు విముఖులమై దానిని ప్రతిఘటింపదగును. శత్రువునందు పశ్చాత్తాపము పొడకట్టినచో వానిని కౌగిలింప బాహువు లొగ్గవలెను.

వెనుక ముందాడు వారికి, అధీరులకు గాంధి ధైర్యము గరపుటను గూడ మానడు. ప్రత్యక్ష చర్యకు వెనుకంజ వేయు వారికి విశ్వాస వచనములు చెప్పుచుండును.

"ప్రత్యక్ష క్రియా చరణము లేనిచో ఏ కార్యమును ఫలింపదు. 'సాత్త్విక నిరోధము' చాలదనియే నే నా మాటను వదలుకొంటిని. స్మట్సు సేనాపతి మనసును మార్చి

* ఇది గీతలకు గాంధి వ్యాఖ్యానము. చంపుట, చచ్చుట అను నీ రెంటిని సమచిత్తముతో చూడవలెనని గీతలకు వాఖ్యానము చెప్పు ధైర్యము పాశ్చాత్త్యుల కేరికేని కలదా?

నది ప్రత్యక్ష చర్యయే. బుద్ధుడు, క్రీస్తు జీవన సమన్వయము న కేమి చెప్పిరి? శాంత క్రోధములను సమన్వయింప వలె ననిరి. బుద్ధుడు శత్రువులగు పురోహితులపై నెత్తి యేగి, వారి పూజల నందుకొనెను. ద్రవ్యమును మార్చు వారిని, వడ్డి వ్యాపారులను ఆలయముల నుండి క్రీస్తు తరిమి వేసెను. కపట భక్తులను పారసీలను కటూక్తులాడెను. ఇంత కంటె ప్రత్యక్ష బల చర్య యేమి కలదు?.........కాని, వారి యీ చర్య ఎంత శాంతి మహితమో కదా!''

ఆంగ్లేయులకు యుక్తాయుక్తములు గరపి, వారి హృదయములను కరగింప వలసియున్నది. గాంధి వారిని ''ప్రియ మిత్రులు'' అని వాకొనును. ''ముప్పది యేండ్లనుండి మీ విశ్వాసమునకు బాత్రుడనగు సహచరుడ'' ననును. ''మీ ప్రభుత్వ మొనర్చిన ద్రోహమునకు బరిహార క్రియ సల్పు''డని వారిని వేడికొనును.

''ప్రభుత్వము చేసిన ద్రోహము నా భక్తిని భగ్నము చేసినది. కాని బ్రిటిషు ప్రజల ధీరత్వము నెడ నా కింకను విశ్వాసమున్నది. భారతము నేడు ధర్మ వీరము నే ఆచరింప నేర్చును. సహాయ నిరాకరణ మనిన ఆత్మ త్యాగమేసుడీ. నా బాధా సహిష్ణుత చే మిమ్ము జయింపగోరుచున్నాను.''

3

గాంధి ఆ నాలుగైదు నెలలలోను ఒక వంక బ్రిటిషు ప్రభుత్వముపై ''నిరాకరణమును'' ప్రయోగించి, స్తంభింప జేయుచుండెను. మరొకవంక అర్థకామ ధర్మాచరణమున

సమర్థము, స్వతంత్రము నగు నవభారతమును నిర్మించుచుండెను. అందు అర్థ సమృద్ధి ప్రధానమని యెంచి, దానికే 'స్వదేశి' యని పేరిడెను (ఆ మాట కనేకార్థము లున్నను ఇదియే ప్రకృతోపయోగి యని యెంచుచున్నాను).

భారత దేశము కొన్ని కొన్ని సుఖములను వదలుకొని, కొన్ని బాధలు పడక తప్పదు. భారతమునకు ఆరోగ్యమును, పుష్టిని గూర్చు నియమములు కొన్ని కావలసి యున్నవి. వానిచే ప్రజల యారోగ్యమును, నీతి సంపదయు వృద్ధియగును. ముందు మద్య సేవాశాప విముక్తి కావలసి యున్నది. కాన, మితపాన సంఘము లేర్పడవలెను. సీమ సారాయములు వెలి వేయవలెను. దాని నమ్మువారిని బతిమాలి ఆ వర్తకము మాన్పింప వలెను.* భారత భూమి గాంధి యొనర్చిన యీ విన్నపము నాలకించి, అందుకు సమ్మతించెను. దేశమంతట మద్య నిషేధోద్యమ వాయువు లొక్క పెట్టున వీవ సాగెను. జన సమూహములు బలాత్కార మొనర్చి సారాయి దుకాణములు మూయించు వేళలందు గాంధి తానే కలుగ జేసికొన వలసి వచ్చెను. "ప్రజలను బలవంతముగా శుద్ధులను జేయ దగదు."

* సారాయి వ్యాపారులగు పారసీకులను దుకాణములు మూయుడని హెచ్చరించుచు గాంధి లేఖ వ్రాసి ప్రకటించెను. మితవాదుల కొక లేఖ వ్రాయుచు నా యుద్యమమున తక్కిన యంశములు రుచింపకున్నను ఈ మద్య నిషేధ కార్యమునకేని కలసి రండని హెచ్చరించెను. నల్లమందు, గంజాయి మున్నగు మత్తు మందుల వ్యాపారము గూడ పనికి రాదనెను.

భారతమున కర్థ సమృద్ధి గూర్చుట మద్యనిషేధ మంత తేలికపని కాదు. ప్రజలకు తిండిమాట యేమి ? బ్రిటిషు వస్తువుల నాంక్ష పెట్టినచో గుడ్డమాట యెట్లు ? గాంధి చాల చిన్న యుపాయము చెప్పెను. ఆయన పూర్వకాల స్వభావమంతయు నందే వెల్లడి యైనది. రాట్నముపై నూలు వడుకు పూర్వవృత్తి ప్రతి యింటను నెలకొనవలె ననెను.

అర్థ సమృద్ధికి చెప్పిన ఈ తాతలనాటి యుపాయము నకు నవ్వుకొని ఈసడించిరి.* భారత దేశ విశేష పరిస్థితులు విచారించినను, గాంధి ఆంతర్యము గ్రహించినను రాట్నపు ప్రయోజనము తెలిసి వచ్చును. కటిక పేదలకు దప్ప నితరులకు రాట్నము పొట్ట నింపునని గాంధి యెన్నడును చెప్ప లేదు. పొలముపాటు లేని వేళలందు ఉపవృత్తిగా రాట్నమును చేపట్ట వలెననియే ఆయన చెప్పినది. ఇది వట్టి అనుమానములకు, కల్పనలకు విషయము గాదు ; వెంటనే తీర్చ వలసిన అక్కర. ఆ దేశమున నూటికి ఎనుబది మంది కర్షకులు. వత్సరమునకు నాలుగు నెలలు వారికి పని పాటులుండవు. పదవ వంతు జనమునకు పస్తులే గతి. సామాన్య సంసారులకు గూడ పొట్టలు నిండవు. ఇంగ్లండు ఈ దురవస్థ కుపశాంతి చేయక పోగా దానిని తీవ్రతర మొనర్చెను. ఆంగ్ల వర్తకులు దేశి వాణిజ్యమును నాశన మొనర్చిరి. భారత సంప దాధారములను ఎండగట్టిరి. ఏటేట 60 కోట్ల

* ఇట్లు నవ్వుదురని గాంధి యెరుగును. కాని రాట్నము నేడున ప్రయోజన కారియే యనియు, ప్రజల కది లేక గడవదనియు, ఆకటి కలమటించు ప్రజా కోటి కదియే ఆదరు వనియు గాంధి వచించెను.

రూప్యములను పీల్చుకొనుచుండిరి. తనకు సరిపడ పత్తిని పండించుకొను ఈ భూమి అందు చాల భాగము లాంకషైరుకు, జపానుకు ఎగుమతి చేసి, వస్త్ర రూపమున తిరిగి దిగుమతి చేసుకొనుచున్నది. సర్వ నాశకమగు ఈ వైదేశిక సాహాయ్యమును భారతభూమి ఉజ్జగించి, తన కర్మాగారములను తాను నిర్మించుకొన వలసి యున్నది. తన ప్రజ కంతటికి తిండి గుడ్డల కొరత తీర్చు నుపాయము చూడక తప్పదు. ఈ లక్ష్య సిద్ధికై నూలును వడికి, బట్టలు నేసెడి యీ పురాణ గృహావృత్తి కంటె వెంటనే చవుకగా చేతి కక్కరకు వచ్చు సాధనము మరియొకటి కన్పించదు. కర్షకులు తమపని మాను కొన నక్కర లేదు. ఒక వంక సోమరులు, నిర్వ్యాపారులు, మరొక వంక స్త్రీలు, బాలురు తీరుబడిగా ఈ వృత్తులను చేపట్ట వచ్చును. తీరిక వేళల భారతీయు లందరు ఈ పనులు చేయవచ్చును.

గాంధి మూడు సూత్రములు చెప్పెను. 1. విలాతి వస్త్ర బహిష్కృతి. 2. నూలు వడుకు వృత్తి నుద్ధరించి ప్రచార మొనర్చుట. 3. గృహ నిర్మిత వస్త్రములనే ధరింప దీక్ష గైకొనుట.

గాంధి వ్యగ్రోత్సాహియై ఈ పనికై దీక్ష వహించెను. నూలు వడుకుట యను ధర్మమును యావద్భారతము నాచరింపవలెనని ఆయన కోరెను. స్కూళ్ళలో దీనిని నేర్పవలెను. పేదల పిల్లలు వడికిన నూలునే స్కూలు జీతముగా గ్రహింపవలెను. స్త్రీ, పురుషు లెల్లరు తీరిక వేళల ప్రతి దినము నొక గంటసేపు నూలు వడుకవలెను. ఈ వృత్తి

విషయమై ఆయన ఎన్నో సూక్ష్మ విచారణలు చేసెను. వడుకుట, నేత, ప్రత్తి ఏకుట, మున్నగు పనులను గూర్చిన సాంకేతిక విషయముల నాకళించుకొని, నేతగాండ్రకు, కొన్న వారికి, విద్యార్థులకు, తలిదండ్రులకు—అందరికి సలహాల నీయసాగెను. కొద్ది పెట్టుబడితో స్వదేశీయంగడినో, సరకుల దుకాణమునో పెట్టుకొన్నచో సులభముగా నూటికి పది రూప్యములు లాభించునని బడిపంతులువలె లెక్కలు వేసి నిరూపించెను. రాట్నపు సంగీతమును వర్ణించునపు డాయన వివశు డగును. అతి పురాతనమగు నీ భారత యంత్రము నేత గాడైన కబీరు కవికిని, తన కుళాయీలు తాను కుట్టుకున్న అలంగీరు బాదుషాకును చక్కని పని కల్పించి ఉల్లాసము గూర్చెనట. గాంధి ఈ వృత్తిని ప్రజాదరమునకు బాత్ర మొనర్పగల్గెను. బొంబాయిలో సంపన్న గృహిణులు నూలు వడుకసాగిరి. హిందువులు, ముస్లిములు గూడ ఖాదివస్త్ర మునే ధరింప ప్రతిన చేసిరి. రవీంద్రనాథుడు గూడ ఇందు అంద చందము లున్నవని అంగీకరించెను. కద్దరు కావలెనని దవ్వుల ఏడెనునుండి, బెలూచిస్థానమునుండి ప్రజ లడుగ జొచ్చిరి.

విదేశవస్తు బహిష్కారావసరమున ఈ యుత్సాహము కొంత హద్దుమీరి నడవవలసి యున్నది. శాంత చిత్తుడని చెప్పదగిన గాంధి కూడ ఈ విషయమున తొందరపడెను. ఈ విలాతి వస్త్రములు పరతంత్రతకు, దాస్యమునకు చిహ్నములు గాన వానిని కాల్చివేయవలెనని గాంధి ఆనతిచ్చెను. 1921 ఆగస్టు నెలలో బొంబాయి నగరమున

విదేశివస్త్ర దహనజ్వాలలు భోగిమంటలవలె లేచెను. భారత దేశమున నున్న ఆంగ్లేయులలో సి. యఫ్. ఆండ్రూసు మహోదారుడు. రవీంద్రనాధ ఠాకూరు కాతడు మిత్రుడు. గాంధికి గూడ పరమాప్తుడు. ఆయన, "ఈ వస్త్రముల నిట్లు కాల్చివేయుటకంటె పేదల కిచ్చుట మంచిది కాదా? మానవుని యందలి విలయ స్వభావమున కిట్టి పనులు దోహదము సేయును కదా!" అని వాపోవుచు గాంధికి లేఖవ్రాసెను. ఇట్టి దేశాభిమానము గూడ హింస వంటిదే యనియు, కష్టించి చేసిన పని నిట్లు నాశమొనర్చుట పాపకర్మ మనియు నాతడు నిరసించెను. కద్దరు నందరు ధరించవలె నన్నంత వరకు గాంధి మాటలకు ఆండ్రూసు సమ్మతించెను గాని ఈ భోగిమంట లాతని విశ్వాసమును సడలించెను. ఆండ్రూసు ఆ లేఖయందు వెళ్లబోసిన హృదయభారము గాంధి మనసున నాటుకొనెను. గాంధి ఆ లేఖను ప్రకటించి, సౌహార్దముమై దానికి ప్రత్యుత్తరము వ్రాసెను. తాను చేసినపని కించుకయు జింతింపననియు, తన కేజాతిపట్లను ద్వేషము లేదనియు, విలాతి వస్తువు లన్నిటిని నాశనము చేయుట తన యభిమతము కాదనియు, ఈ వస్త్రములు మాత్రము ప్రత్యక్ష హానికరము లనియు నందు తెలిపెను. "ఆంగ్లేయుల ఈ వస్త్ర వ్యాపారము లక్షలాది భారతీయులను నాశన మొనర్చెను. దీనివలన అనేకులు మాల మాదిగల అధోగతికి పాలై పోయిరి. ఇంకెందరో పొట్టకొరకు సిపాయి దండులో చేరిరి. వారి స్త్రీలు గతిమాలి, సిగ్గుమాలిన బ్రదుకునకు పాల్పడిరి. ఇంతటి పాపముచే కళంకితమైన వస్త్రమును ధరిం

చుట మైలపడుటయే యగును. తమ దేశము నిట్లు పీల్చి పిప్పిచేసిన ఆంగ్లేయులను ప్రజ లిన్నాళ్లు ద్వేషించుచుండిరి. ఆ ద్వేషమును ఆంగ్లేయులనుండి నేను వారి వస్తువుల దెసకు మరల్చితిని. ఈ పాప కళంకము ఆ వస్తువు లమ్మెడి ఆంగ్లేయులకే కాదు; వానిని కొన్న భారతీయులకు గూడ చుట్టికొనును. కావున వీనిని కాల్చివేయుట ద్వేషముచే గాదు; ప్రాయశ్చిత్త మొనర్చుకొనుటకు. దుష్టాంగ ఖండనమువలె తప్పని పని యిది. పాపము సోకిన యీ మైలగుడ్డలను పేదలకిచ్చుట యుక్తముకాదు. పేదలకు గూడ అభిమానము కద్దు.''

## ౪

ప్రజల నిట్లు అర్థ కామముల విషయమున స్వతంత్రుల నొనర్చినంత మాత్రముననే వారి పరతంత్రత పోజాలదు. ఆత్మకూడ పరతంత్రతనుండి విడివడవలెను. పాశ్చాత్య సంస్కృతి భారతదేశమునకు కంఠపాశమై చుట్టికొన్నది. దానిని త్రెంచివైచి, ప్రజలకు భారతీయమగు విద్యాశిక్ష నొసగవలసి యున్నది. అట్టి విద్యాసౌధమునకు మూలభిత్తిక నిర్మించుటకై గాంధి ప్రబల యత్న మొనర్చెను.

ఆంగ్లేయుల దేశికత్వమున ప్రాచ్య సంస్కృతి లేశములను కాపాడుచున్న కొన్ని విశ్వవిద్యాలయములు భారతదేశమున నింకను ఉన్నవి. ముస్లిము సంస్కృతికి ఆచార్య పీఠము ఆలిఘురులో నలుబది యైదేండ్లుగా నెలకొని యున్నది. సిక్కులకు ఖాల్సా కళాశాలయు, హిందువులకు కాశీ విశ్వ

విద్యాలయము ఉన్నవి. కాని ఇవి బ్రిటిషు ప్రభుత్వవశం వదములై, దానిచే ద్రవ్య సహాయమును పొందుచున్నవి. వీనిని వర్జించి, వానిస్థానే నూతనములు, పవిత్రములు నగు సంస్థలను నిర్మింపవలెనని గాంధి అభిలషించెను. 1920 లో అహమ్మదాబాదు నగరమున గుజరాతు విద్యాపీఠమును గాంధి నెలకొల్పెను. అఖండ భారత లక్ష్యమే దీనికి ప్రేరక మైనది. ఇస్లాము హైందవ ధర్మములు రెండును దాని మూల స్తంభములు. ప్రాంతీయ భాషల నుద్ధరించి వాని ద్వారమున భారతజాతిని సముద్ధరించుటకా విద్యాపీఠము పూనుకొనెను. "పాశ్చాత్య భౌతిక దర్శనముల నేర్చినంత మాత్రమున విద్య పరిపూర్తి చెందదు. ప్రాచ్య సంస్కృతు లను గూడ చక్కగా నభ్యసింపవలెను. సంస్కృత పాలీ మాగధీ భాషలు, పారసీక అరబ్బీ భాషలు జ్ఞాన నిధాన ములు. వానిని గాలింపనిచో మన జాతికి పుష్టినిచ్చు సంజీవ కరణి లభింపదు. పూర్వులు పాడినదే పాడుచు, చేసినదే చేయుచు కూరుచుండుటే కాదు మన విద్యా విధానము. పూర్వులు వేసిపోయిన పునాదులపై చిరతరానుభవ సంపన్న మగు నూతన నిర్మాణమును చేయవలసియున్నది. కాలాం తరములందు భారతభూమి కాచార్యకములై, ఈ గడ్డలో కలసిపోయిన భిన్న సభ్యతలను మన విద్యాపద్ధతి సమన్వ యింపవలెను. ఆ సమన్వయమున అన్ని సంస్కృతులకు సమర్హ గౌరవము కల్పింపవలెను గాని అమెరికాలోవలె ఏ యొక్క సంస్కృతియో తక్కిన వానిని దిగమ్రింగుట పనికిరాదు. బలవంతముగా బాహ్యైక్యము కల్పించుటకాదు

మనకు గావలసినది. సంస్కృతి సమ్మేళనమును సాధింప వలెను.'' గాంధి ఇంత లెస్సగా యోజించి చెప్పిన యీ మాటలు మనకును ఉపకరించును. హిందువులు కొరానును, ముస్లిములు హైందవ శాస్త్రములను—ఇట్లు విద్యార్థులందరు సకల మతధర్మములను గ్రహింపవలెను. బహిష్కార బుద్ధికి తక్క గుజరాతు విద్యాపీఠమున మరి దేనికిని బహిష్కారము లేదు. మానవలోకమున ''అస్పృశ్యులు'' ఎవరును ఉండజాలరు. హిందీ, ఉరుదు, సంస్కృతములతో గూడిన హిందూస్థానీయే నిక్కపు రాష్ట్రభాష గాన దాని నెల్లరు నేర్చి తీరవలెను.*

బుద్ధి జీవులగు అగ్రవర్ణులకు కర్మ పరతను శ్రమజీవులకు జ్ఞానపరత్వమును అలవరచవలెను. అపుడు గాని భిన్న వర్ణముల హెచ్చు తగ్గులు సమసిపోవు. స్వాతంత్ర్యవాంఛ కేవల శాస్త్ర గ్రంథ పఠనము చేతనే గాక కర్మ విద్యాభ్యాసము చేగూడ పరిపుష్టి నందును. బుద్ధి సంస్కారమునే ప్రధానముగా నెంచి కర్మ పరత్వము నవగణించెడి పాశ్చాత్య విద్యా పద్ధతిని గాంధి నిరసించి, కర్మ పరతను మొదటి నుండియు శిశువుల కలవరచుట యుక్త మనెను. తన విద్యకగు సొమ్మును శిశువు నూలు వడికి సంపాదించు టే కాక,

* ఇంగ్లీషుకు గాని మరి యే పాశ్చాత్య భాషకుగాని వెలిలేదు. స్కూళ్లలో చదువు ముగిసిన పిమ్మటనే వాని ప్రమేయము. విశ్వవిద్యాలయములందు గూడ మాతృభాషయే విద్యాసాధనము. మణిలోని భిన్న కోణముల కాంతులును ఏకముఖమై ప్రకాశించునట్లు, సకల భేదములను సమన్వయించుకొని ఏకమై వెలుగు విశ్వజీవనమే గాంధి ఆశయము.

ఆ వృత్తిచే స్వతంత్రమగు జీవనోపాధిని కల్పించుకొన్న వాడగును. శిశువుల చిత్తములను గూడ ఆదినుండి సంస్కరించు చున్నచో వారికి సచ్ఛీల మలవడును. బాలుర కంటె ముందు అధ్యాపకులు గూడ సచ్ఛీలు రగుట ముఖ్యము.

ఇట్టి ఉత్తమ విద్యా సంస్థలే నేటి విద్యా పద్ధతికి శిబిర ప్రాయములగును. ఇవి కేవలము చదువు చెప్పే సంస్థలు గావు. ఇహ పరములను సాధించే సన్యాసుల మఠముల వంటివి. ఇట్టి మఠములు పూర్వము యూరపులో ఉండేవి. తొల్లిటి ఋష్యాశ్రమములవలె భారత ధర్మజ్యోతిని కాపాడి తత్కాంతిని దిగంతముల నివి ప్రసరింప జేయగలవు.

౨

అహమ్మదాబాదు నందలి సత్యాగ్రహాశ్రమము గాంధికి గారాబు పట్టి. అచటి నియమములు శిష్యులకు కంటె గురువులకే ఎక్కువగా వర్తించును. అచటి అధ్యాపకులు వానప్రస్థవ్రత మనుష్ఠింపవలెను. ఇతర మఠములందు వలె ఆ నియమములు కాలక్రమమున శుష్క వైరాగ్యమునకు దారి తీయక, తపస్వి జనోచితమగు త్యాగ మహిమతో, ప్రేమ సంపదతో తొణికిసలాడు చుండును.

1. ఆ యధ్యాపకుల వ్రతములలో మొదటిది సత్యము : అసత్యమాడకుండుటయే కాదు : దేశహితము కొఱకు గూడ వంచనము కూడదు. సత్యము కొరకు గురువును, తండ్రిని గూడ, ప్రహ్లాదుని వలె, ధిక్కరింప వలెను.

2. అహింస : ఏ ప్రాణిని చంపకుండుటే కాదు : అధర్మరతులను గూడ హింసింప దగదు. వారి యెడ క్రోధము నుతాల్పక ప్రేమము నెరపవలెను. గురువు, ప్రభువు మున్నగు పెద్దల దౌష్ట్యమున కేనియు ఎదురొడ్డదగునే కాని వారిని హింసింప జనదు. దుష్టజనుల ఆజ్ఞను ధిక్కరించి, ప్రాణమునకు గూడ తెగించి తాను నానా హింసలకు గురి యగుటే సత్యాహింసావ్రతము. అట్టివాడు తుట్ట తుదకు దుష్టజన చిత్తములను కరగించి జయమందును.

3. బ్రహ్మచర్యము : బ్రహ్మచర్యము తాల్పనిచో పై రెండు వ్రతములు కొనసాగవు. పరస్త్రీని కన్నెత్తి చూడకుండుటే కాక, మనస్సులో గూడ కామ వికారమునకు చోటీయదగదు. గృహస్థుడు భార్యయెడల మోహ వివశుడు గాక, పవిత్ర హృదయుడై ఆమెతో సహధర్మము నాచరింప వలెను.

4. జిహ్వానిగ్రహము : జిహ్వను నిగ్రహించుటే ఈ వ్రతము లన్నిటికి మూలకందము; ముఖ్యముగా బ్రహ్మ చర్యమున కిది ఆయువు పట్టు. కావున ఈ వ్రతము వేరుగా పేర్కొనబడినది. ప్రజారాధకుడు దేహ ధారణ కొరకే భుజించుచు, రాజస తామ సాహారములను విడనాడుచు, మితాహారము నభ్యసింప వలెను.

5. అస్తేయము : పర ద్రవ్యము నపహరించుటే కాదు; నిజమునకు మన కక్కరలేని వస్తువుల నుపయో గించుటయు స్తేయమే యగును. ఏ నాటి కానాడు మన అక్కరకు సరిపడునంత మాత్రము ప్రకృతియే ఇచ్చుచుండును.

6. అసంగ్రహము : అధిక సంగ్రహము తగదు. మన నిత్య కృత్యములకు అపరిహార్యమైనవి తప్ప ఇతర అర్థములను సంగ్రహించుట దోషము : కుర్చీలు లేకున్నను జరగునపుడు వానినేల సంపాదింపవలెను? ఈ విధముగా నిరంతరము అల్పసంతుష్టి నలవరచుకొనుచు ఈ వ్రత మాచరింపదగును.

ఈయాశ్రమ వాసులకు మరిరెండు ఉపవ్రతములున్నవి.
1. స్వదేశి : సత్యవ్రతులు వాడుకొనే వస్తువుల ఉత్పత్తియందు వంచనాగంధ మున్నచో వానిని విసర్జింపవలెను. లాంకుషైరు, మాంచెస్టరు మిల్లులలోను, భారత దేశపు మిల్లులలోను చేసే వస్తువుల యందేమి వంచన మున్నదో ఆత డెరుగడు గదా! అది యటులుండ ఆ మిల్లులలో పనివాండ్రు ఎన్నో అగచాట్లు పడుచుచుందురు. అగ్నివల్ల నడచే ఈ యంత్రముల వల్ల విపరీతమగుప్రాణి నాశము తటస్థించుటే కాక అచటి పనివాండ్రు అకాల మృత్యువు వాతపడుచుందురు. కావున వైదేశికములు, యంత్ర సముత్పాదితములు అగు వస్తువులను అహింసావ్రతుడు విడనాడవలెను. ఇంకను తరచి చూచినచో ఆ వస్తువులను వాడుకొన్న యెడల అస్తేయ అసంగ్రహ నియమములకు భంగము వాటిల్లునని తెలియగలదు. చే మగ్గములపై నేసిన వస్త్రముల కంటె మిల్లు వస్త్రములు మెరుగని, నాగరిక లక్షణమని యెంచి వానిని వాడుచున్నాము. బ్రహ్మచర్య నిష్ఠుడు దేహమునకు కృత్రిమాలంకరణములు చేయ నొల్లడు. అతని సాత్త్విక జీవనము వన్నె చిన్నెల వస్తువులను, వస్త్రములను

విడనాడును. పరదేశపు గుండీల నేనియు ఆతడు వాడు కొనడు. ఈ విధముగ ఆతని జీవనమెల్ల స్వదేశ వ్రతముచే శోభితము కాగలదు.

2. అభీతి : భీత చిత్తులు సత్యాహింసామార్గమును త్రొక్కజాలరు. కావున రాజులకు, ప్రజలకు, కులమునకు, కుటుంబమునకు, దొంగలకు, దోపిడిగాండ్రకు, వ్యాఘ్రాది క్రూర మృగములకు, తుదకు మృత్యువునకు గూడ భయ పడక చరించుట అభ్యసింప వలెను. పరులు ఆక్రమించి వచ్చినపుడు ధీరచిత్తులు సత్యబలముచే, ఆత్మ బలముచే నిజ రక్షణ మొనర్చికొనన నేర్తురు.

ఆశ్రమములోని అధ్యాపకుల శీల మీ విధముగా పుటములు దీరవలసి యున్నది. ఇట్టివే మరికొన్ని నియమము లను గూర్చి గాంధిజీ పరామృశించుచు అందు కర్షకత్వము వంటి కాయకష్టమును విధిగా పేర్కొనెను. భారతదేశ మండలి ప్రధాన భాషలను గూడ ఈ యధ్యాపకులు నేర్చి యుండవలె ననెను.

నాలుగేండ్లు నిండినప్పటి నుండియు విద్యార్థుల కాశ్ర మములో ప్రవేశ మొసగుదురు. ఆశ్రమవాసము చేసిన పది యేండ్లును విద్యార్థులచటి నియమముల బాలింపవలెను. ఆ పదియేండ్లలో వారు తిరిగి స్వగృహమున కేగరాదు. వారికి తలిదండ్రుల జోలి ఉండదు. సాత్త్వికమగు శాకా హారమును దినుచు, సాత్త్వికములగు ఉడుపులు దాల్చు చుందురు. వారమునకు మూడు పూటలు సొంతపనులు చూచుకొనుటకు, ఏటికి మూడు నెలలు పాదచారులై దేశా

టన మొనర్చుటకు ఇచ్చే సెలవులు తప్ప మరి సెలవు లనుచు నుండవు. హిందీని, ఒక ద్రావిడ భాషను నేర్చి తీరవలెను. అదనముగా ఆంగ్ల భాష నభ్యసించుటే కాక, ఉరుదు, బెంగాలీ, తెలుగు, దేవనాగరి లిపులను గూడ వారు నేర్వవలెను. మాతృభాషా ద్వారమున దేశచరిత్ర, భూగోళ శాస్త్రము, గణితము, అర్థశాస్త్రము, సంస్కృతమును విద్యార్థు లభ్యసింతురు. వీనితోపాటు నూలు వడకుటను, వ్యవసాయమును నేర్చికొందురు. ఆశ్రమ విద్యార్థులు పది యేం డ్లిట్లు ధర్మమయ జీవనమున కలవడిన పిమ్మట స్వగృహముల కేగుదురు. లేదా, తమ గురువులతోపాటు తాము ను ఆశ్రమస్థు లగుదురు. ఈ పదియేండ్ల విద్యాభ్యాసమునకు విద్యార్థులు కాసువీస మేనియు వెచ్చపెట్ట బనిలేదు.

౬

గాంధిజీ ఉద్యమము ధార్మిక మనియు, ఆ లక్ష్యములే ఈ విద్యావిధానమునకు ప్రాతిపదిక యనియు జూపెట్టుటకే ఇంతదూర మీా విద్యాపద్ధతిని పరామృశించితిని. గాంధి నవభారత నిర్మాణమునకు బూనుకొనెను. అందులకై భారత ధర్మాను రూపమైన సచ్ఛీలము, ధీరత్వముగల పురుషులను సృజింపవలెను. ఏసు శిష్యులవంటి ధర్మజీవనులే ఆ సృష్టికి ఉపాదానము కాగలరు. మన పాశ్చాత్య విప్లవ కర్తలవలె దండనీతిని, శాసనములను నిర్మించుట కాదు గాంధి చేసినది; అతడు నూతన మానవలోక స్రష్ట.

# 6

# గాంధి నాయకత్వము

క్రిందటి ప్రకరణమున వర్ణించిన ఈ నవభారత చైతన్యోదయమును, దాని ప్రభావమును ప్రభుత్వములు గుర్తింప నేరవు. ఆంగ్లప్రభుత్వము గూడ అట్లే దానిని గురుతింప నేరక మొదట అలక్ష్యముచేసి, అపహసించెను. 1920 ఆగస్టు నెలలో అప్పటి వైస్రాయి ఛెమ్సుఫర్డు ప్రభువు "ఇంతకంటె అపహాస్య భాజనమైన ఉద్యమము ఉండ"దని నవ్వుకొనెను. ఈ తృణీకారము చాల నాళ్లు నిలిచినదికాదు. క్రమముగా ప్రభుత్వమున కా బింకమును, బిరుసుదనమును తగ్గజొచ్చెను. ఏమి చేయుటకును కాలు చేయాడక "ఈ ఉద్యమము అహింసా పూర్వకముగ నున్నంతకాలము దండనీతిని ప్రయోగించము. ప్రజలు హద్దు మీరి, ఆయుధములు దాల్చి, తిరుగుబాటు చేసినచో అందుకు తగినట్లు పరుష దండము ప్రయోగింతుము," అనుచు 6-11-1920న ప్రభుత్వము దాక్షిణ్య ముట్టిపడు ప్రకటనము గావించెను.



ప్రజలు హద్దు మీరకున్నను ప్రభుత్వము అనతి కాలములోనే హద్దు మీరుట జరిగెను. భారత కాంగ్రెసు సభ కార్య నిశ్చయము చేసేవరకు తాత్కాలికముగా

నడచిన సహాయ నిరాకరణము, 1920 డిసెంబరులో నాగ
పూరు సభ ఈ యుద్యమము నామోదించుటతో ప్రభుత్వము
నకు గుండె నిబ్బరము చెడినది. నాగపూరు సభ దీనిని త్రోసి
పుచ్చునని ప్రభుత్వ మాసపడెను. ఆ యాశ నిరాశ యగుటచే
దానికి కలవర ముదయించెను.

"శాంతియుతములు, శాసన బద్ధములు నగు సర్వ
మార్గముల చేతను ప్రజలకు స్వరాజ్యమును చేకూర్చుటే
కాంగ్రెసు సభా లక్ష్యముగా" నాగపూరు సభ నిశ్చ
యించెను. అంతకు మున్నే సాంగముగా రూపందిన సహాయ
నిరాకరణోద్యమమునకు నాగపూరు సభ వృత్తి వివరణ
ములు సల్పుచు అహింసను ప్రధానముగా వక్కాణించెను.
ఈ యుద్యమము ఫలసిద్ధి నందవలెనన్న, అప్పటికి దేశములో
ప్రజల మధ్య—ముఖ్యముగా హిందూ-ముస్లిములు, సంప
న్నులు-దరిద్రుల మధ్య—రాజుచున్న కలహములు చల్ల
నారుట ముఖ్యమని ఆదేశించెను. మరియు ఆ సభయందే
కాంగ్రెసు సభా నిర్మాణము మార్పుచెంది, దేశ మండలి
అన్ని పార్టీలకు అందు ప్రాతినిధ్యము లభించెను.

ఈ యుద్యమపు టాంతర్యమును కాంగ్రెసు ఇంచు
కయు దాచిపెట్టలేదు. సహాయ నిరాకరణము ప్రథమ దశయే
యనియు, ముందు ముందు ప్రభుత్వమునకు పన్నుల నిచ్చుట
కూడ మాని సర్వ విధముల దానిని వెలివేయ వలసి యుండు
ననియు ఆ సభ ప్రకటించెను. ఆచరమ దశకు ప్రజలను సంసి
ద్ధుల నొనర్చుటకై ఈ లోపల నూలు వడకుట మొదలగు
స్వదేశి ప్రచారము చేయుటకును, విద్యార్థులు వారి తలి

దండ్రులు, లాయర్లు, ధర్మాధి కృతులు ప్రభుత్వ సంబంధము వదలుకొన వలెనని ఆదేశించుటకును ఆ సభ నిశ్చయించెను. ఈ యాదేశమును అతిక్రమించిన వారికి ప్రజలు ఆశ్రయ మొసగరాదనియు నాగపూరు సభ ప్రకటించెను.

ఆంగ్లేయులు పాలించుచున్న భారత రాజ్యములో మరొక స్వతంత్ర రాజ్యస్థాపన వంటిదే కాగల దీ ఉద్యమము. ఆంగ్లేయులు సామమో, దండమో ప్రయోగించవలెనే కాని చేతులు ముడుచుకొని కూరుచుండే పాకము తప్పినది. సామము ఏ మాత్ర మవలంబించినను ప్రజలకు ప్రభుత్వము నకు సమాధానము కుదిరెడిదే. కాంగ్రెసు స్పష్టముగా చెప్పనే చెప్పినది. "మా లక్ష్య సిద్ధికి ఇంగ్లండు తోడ్పడిన మంచిదే; లేకున్నచో దానిని శిరించి కార్యసాధన చేయుదు" మని. ఇతర జాతుల పట్ల పాశ్చాత్య రాజ్యాలు అవలంబించెడి పరుష దండోపాయమునే బ్రిటిషు ప్రభుత్వము కూడ చేపట్టెను. దండ ప్రయోగమునకు ప్రభుత్వము వంక దొరకు నాయని వెదుక నారంభించెను. వెదకినచో దొరకక పోదు కదా!

'అహింస అహింస' యని గాంధి ఎంత ముడివేసి కొన్నను, కాంగ్రెసు దాని నామోదించినను దేశములో పలు చోట్ల ఈ సహాయ నిరాకరణోద్యమమునకు ఏ మాత్రమో సంబంధము గల దౌర్జన్య చర్యలు చెలరేగెను. యు. పి. రాష్ట్రమందు, ఇతర ప్రదేశములందు వ్యావసాయికములగు వివాదులు, కవులుదార్ల తిరుగుబాట్లు తల యెత్తుటయు, పోలీసు లందు జోక్యము కల్గించుకొనుటయు దారుణ

పరిణామములకు దారి తీసెను. మరొక వంక అకాలీ సిక్కుల ధార్మికోద్యమము కూడ ఈ సహాయ నిరాకరణ పద్ధతుల నవలంబించెను. తత్ఫలితముగా 1921 ఫిబ్రవరిలో 200 సిక్కులు హతులైరి. ఈ దుష్పరిణామము లన్నిటిని గాంధికి అంటగట్టుట న్యాయము కాదు; ధర్మమును కాదు. కాని, ప్రభుత్వ మీ సందు చూచుకొని 1921 మార్చినుండి ఆ సంవత్సరాంతము వరకు క్రమ క్రమముగా దారుణములగు దమన చర్యలు సలిపెను. కల్లంగడుల ముందు సాగిన పికెటింగు ముఖ్యముగా ప్రభుత్వ దండనీతికి చక్కని సాకుగా దొరకెను. పాశ్చాత్య నాగరకతకు మద్యపానమునకు ఈ చెలిమి క్రొత్తది కాదు. ప్రభుత్వము వలంటీరు దళములపై ఆంక్ష విధించెను. రాజద్రోహ ప్రచారక సమావేశములను నిషేధించెను. ప్రజల చర్యలకు అరాజకములని, విద్రోహము లని పేరు పెట్టి, వానిని నిర్దాక్షిణ్యముగా మట్టుపెట్టుడని రాష్ట్ర ప్రభుత్వములకు, పోలీసు బలగమునకు సర్వ స్వాతంత్ర్యమును ప్రభుత్వము ప్రసాదించెను. వేలకొలది ప్రజలు బద్ధులైరి. సమ్మాన్యులకు కూడ మాన్యత కరవయ్యెను. ఈ దారుణ దండనీతి ఊరకపోదు గదా! పలుచోట్ల దొమ్మి జగడములు చెలరేగెను. పోలీసులకు ప్రజలకు తలపట్లు పొసగెను. చావులు, గృహ దహనములు తప్పవయ్యెను. అంతట కాంగ్రెసు సభా నిర్వాహకులు బెజవాడలో సమావిష్టులై, శాసన ధిక్కారము ప్రయోగింప వలెనా, వలదా అని ఆలోచించిరి. ఆ స్థితిలో అపురూపమగు సద్బుద్ధి వారికి పొడమెను. రెండు వైపుల వాడిగల శాసన ధిక్కారాయుధమును ప్రయో

గించుటకు దేశకాలము లింకను పక్వముగా లేవని వారు నిశ్చయించిరి. ముందు అర్థ బలమును, మంది బలమును సమకూర్చుకొనుటకై కార్య నిశ్చయ మొనర్చిరి.

౨

భారత భూమిలోని భిన్న జాతులను, వర్ణములను, ధర్మములను కూడగట్టుటకై గాంధి ద్విగుణీకృతోత్సాహముతో నడుము గట్టెను. ధనాశా విద్ధులగు పారశీక వణిక్ప్రముఖులను ప్రజోద్యమము నభిమానింప వలసినదని గాంధి విన్నవించెను. హిందూ ముస్లిముల మధ్య చిరకాలము నుండియు సందేహములు, పొరపొచ్చెములు, మెర మెరలు ఎన్నియో ఉన్నవి. ఈ యుభయుల చెలిమికి గాంధి తన శక్తిని ధారవోసెను. ఆచరణ యోగ్యము గాని పైపూత స్నేహములు గాంధికి గిట్టవు గాన దృఢతరమగు స్నేహ బంధము నాతడు సాధింప నెంచెను.* హిందూ సంఘ బహిష్కృతులగు అంత్యజుల నుద్ధరించుటకై గాంధి

* మహమ్మదాలీయు గాంధియు మిత్రులు. వారి భిన్న ధర్మములు ఆ మైత్రి కడ్డము రావు. ఆ యుభయులు పరస్పరము వియ్యమందకున్నను, విందులు గుడువకున్నను ఒండొరులపై ప్రీతి గౌరవములకు లోపము లేదు. హిందూ ముస్లిములకు మంచపు బొత్తును, కంచపు బొత్తును కల్పించుటకు గాంధి ప్రతికూలుడు కాడు. కాని అందుల కింకను కాలము పరిపక్వము కాలేదని ఆయన తలంచెను. కనుల యెదుట నున్న దానిని గమనింపక గాంధి కనులు మూసికొనడు. అనుభవ సహితమగు ఆయన లోకజ్ఞత కిది చక్కని లక్ష్యము.

అంతట దీక్ష వహించెను. అంత్యజులకు జరిగిన అమానుషాపచారమునకై ఆయన హృదయము క్రోధ ఘూర్ణితము, శోక విహ్వాలితము నాయెను. వారికి న్యాయ్యము ఘటింప నాయన వీర కంకణము ధరించెను. గాంధిజీ యశము శాశ్వతమగుటకీ యొక్క దీక్షయే చాలును. అంత్యజుల దురవస్థ కాతడు హైందవ ధర్మ కళంకమని పేరిడెను. ఈ కళంకము బాల్యము నుండియు గాంధికి వ్యథా హేతువైనది. గాంధి చిన్ననాట వారియింటి కొక అంత్యజు డేదో పని చేయుటకై రాగా వానిని సమీపింప రాదని ఇంటిలోని వారు గాంధిని నిషేధించిరట. ఆ నిషేధమును గాంధి పాటింపక, తల్లి దండ్రులతో ఆ విషయమై చర్చించెనట. బడిలో అంత్యజుల సరసనే గాంధి ఆసీనుడై వారిని తాకు చుండెడివాడు. అట్లు తాకిన దోషము పోవుటకై ముసల్మాను నొకని స్పృశింపుమని తల్లి బోధించెడిదట. గాంధి పండ్రెండవ యేటనే కృత నిశ్చయుడై భారత భూమినుండి ఈ పాపమును పారద్రోలి తీరుదునని శపథ మొనర్చెను. ఈ యవర్ణ సోదరుల నుద్ధరించు టెట్లా యని గాంధి సమాలోచింప దొడగెను. అస్పృశ్యులను వెనుక వేసికొని వచ్చునపుడాతని యాత్మ నిర్నిబంధమై ప్రకాశించును. అస్పృశ్యత శాస్త్ర సమ్మతమే యని ఋజువైనచో గాంధి తాను హైందవ ధర్మమునే పరిత్యజింతు నని వాకొనుటయే ఇందుకు తార్కాణ. భారతీయులకు వాటిల్లిన బాధలు, అన్యాయ్యములు అన్నియు ఈ యస్పృశ్యతా పాపమునకు ఫలమే యని గాంధి చెప్పు చుండును.

"మన పాపఫలమే బ్రిటిషు సామ్రాజ్యమున మనల నస్పృశ్యుల నొనర్చినది. ముందు మన మీా పాపమునకు ప్రాయశ్చిత్త మొనర్చుకొని ఆ పిమ్మట ఆంగ్లేయుల పాపము నకు బరిహారము కోరవలెను. ఈ యస్పృశ్యతయే భారత భూమిని పతితము గావించినది. అస్పృశ్యు లున్నంతకాలము మనకు స్వరాజ్యము గగనకుసుమమే. ముమ్మాటికి మనము దోషులము. మనపట్ల ఇంగ్లండు చేసిన దోష మింతకంటె అధికము కాదు. మానవ ధర్మమునకు జరిగిన ఈ ద్రోహ మును కడిగివైచి, దుర్బల రక్షణము సల్పుటయే మనకు అవశ్యాచరణీయము. ఈ పాపకళంకము మనలను మృగ ప్రాయుల నొనర్చినది. స్వరాజ్యోదయముతోపాటు లోక మున ధర్మముగూడ అవతరింపవలెను (27-10-1920, 27-4-1921).

భారతప్రజ హరిజనుల కష్ట నివారణమునకై వెంటనే కొన్ని శాసనములు చేసి, వారికై చాల పాఠశాల లేర్పరచి, చెరువులు త్రవ్వించవలెనని గాంధి యభిలషించెను. అస్పృ శ్యులకు జరిగిన ఈ యపచారమును సవర్ణులు ఎన్నడో తొల గింతురని గాంధి చేతులు ముడుచుకొని జాగుచేయజాలక, తాను అస్పృశ్యుల పక్షమున జేరెను. తానే వారికి నాయ కుడై అవర్ణులను సుసంఘటితుల గావించి, కర్తవ్య విచారణ చేయజొచ్చెను.

అవర్ణుల కష్టనివారణమునకై వారు ప్రభుత్వము నాశ్రయించుట యుక్తమేమో యనిన అదియు మరొక దాస్యమే యగును. లేదా, వారు హైందవ ధర్మమునే విడ

నాడి (చూచితిరా ఈ హైందవ ధర్మాభిమాని దెంతటి దయా వీరమో!) క్రైస్తవమునో, ఇస్లామునో అవలంబించి నచో? అస్పృశ్యత హైందవధర్మ విహితము కాదనియు, ఇటీవల చేరిన కలుపు మొక్కవంటి దనియు గాంధి నమ్మ టచే సరిపోయినదే గాని లేకున్నచో అస్పృశ్యులచే అంత పనియు చేయించెడివాడే. అస్పృశ్యులు తాము సుసం ఘటితులై, నిజస్వత్వ రక్షణము చేసికొనుటయే కర్తవ్యము. సవర్ణులతో వేరుపడి సహాయ నిరాకరణ మొనర్చుటయే ఇందుకు సాధనము. (మరొక దేశభక్తు డెవడైన ఇట్టి ఉప దేశము చేయ సాహసింప గలడా!). మరియు నేమను చున్నాడో చూడుడు. "అస్పృశ్యులకు నాయకులు లేరు. తమ్ము దాము సంఘటించుకొనే శక్తి చాలదు. కావున ఈ అవర్ణ లందరు సహాయ నిరాకరణోద్యమమున చేరుటే తారకము. ఆ యుద్యమమున జాతి వర్ణ భేదములు సమసి పోగలవు. అది సమస్త పాపపరిహారము. అందుచేరిన వా రెవ్వరు అస్పృశ్యతను పాటింపజాలరు. అట్లు పాటించినచో వారి పాపమునకు పరిహారమే యుండదు." హైందవ ధర్మ మును, మానవత్వమును, దేశభక్తిని కూడ గాంధి ఈ విధముగా సమన్వయించి రక్షింప గల్గెను. (27-10-1920)

1921 ఏప్రిలు 13, 14 లలో అవర్ణుల సంఘటనకై సమావేశము జరిగెను. గాంధియే సభాధ్యక్షుడు. గాంధి ప్రసంగములలో ఆనాటిది అతి రమణీయ మనదగినది. వర్ణ భేదములు సమసిపోవలె ననియే కాదు; భావి భారతీయ సంఘ జీవనమున ఈ అస్పృశ్యులే ముఖ్య పాత్రధారులు కాగలరని

కూడ ఆయన వచించెను. అస్పృశ్యులలో అభిమాన ముదయింపజేసి, తన హృదయమున వెలుగు ఆశాజ్యోతిని వారి హృదయములందుగూడ వెల్గించెను. "మీలో అమేయశక్తి పొనుగుపడి యున్నది. మరి యైదు మాసములలో భారత కుటుంబమున మీరు సమర్హాసనము నధిష్ఠింపగల" రనెను.

ఈ మాటలతో భారత హృదయ మించుక కరగి, పలుచోట్ల ప్రజ లా యుపదేశము ననుసరించుట గాంధికి సంతోష కారణమైనది. * గాంధిని నిర్బంధించిన నాడుగూడ ఆయన అస్పృశ్యుల విషయమున తన యత్న మెంతవరకు ఫలించినదా యని విచారణ చేయుచునే యుండెను. ఎందరో బ్రాహ్మణు లీ మహాత్కార్యమునకై నడుము గట్టిరి. సవర్ణులు తాపతప్తులై అవర్ణులపట్ల అనురాగిల్ల జొచ్చిరి.

## 3

గాంధికి ఇంతటి యౌదార్యము స్త్రీజనోద్ధరణము పట్లగూడ నున్నది. భారతీయులలో స్త్రీ పురుష సంబంధమున అవిహితము, అతిమాత్రము నగు కామమే ప్రధానమగుటచే అచటి స్త్రీల స్థితి శోచ్యమై పోయినది. అతి బాల్యవివాహములచే ఆ ప్రజల దేహ మనోబలము లకాల వార్ధకమునకు పాల్పడును. నిరంతర కామ ప్రవృత్తి స్త్రీల నభిమాన హీనల నొనర్చెను. దేశభక్తులగు పురుషులకు

* అప్పటినుండియు అస్పృశ్యతకు కొంత వాడి తగ్గినది. పల్లెలలో చాలచోట్ల అవర్ణులు సవర్ణులతో పాటు మెలగజొచ్చిరి. మదరాసు రాష్ట్రమున మాత్రము వారిస్థితి శోచ్యముగానే యుండెను.

గూడ ఈ యనాదరాతిచార దోషము కలదని గాంధి వ్రాతలు స్పష్ట మొనర్చెను (6-10-1920, 21-7-1921). అస్పృశ్యత వలెనే ఇదియు మహామారివంటి జాడ్యమని గాంధి గ్రహించెను. లోకసామాన్యమగు ఈ దోషమునకు గూడ ప్రతిక్రియ స్త్రీలే చేయవలసియున్నదని నిశ్చయించెను. పురుషులకు కామోప భోగ్యలగుటకు సమ్మతింపక స్త్రీలు అభిమానవతులై పురుషులకు గౌరవభాజనలుగా చరింపవలసినదని ఆయన హెచ్చరించెను. స్త్రీలు ధీరచిత్తలై, ప్రజోద్యమము లందు కష్ట నిష్ఠురము లనుభవింపవలెనని ఉపదేశించెను. వైదేశిక వస్త్రములు మున్నగు వానిని దహించి, భోగ సామగ్రి నుజ్జగించి స్త్రీలు పురుషులతో పాటు కడగండ్ల పాలుగావలెనని ఉద్బోధించెను. కలకత్తా మున్నగుచోట్ల ఉత్తమ కుటుంబినులు కారాగారా వాసమును వరించు శుభ సూచన లప్పుడు కన్పింపజొచ్చెను. స్త్రీలు అధికాదర పాత్రతకై దేవులాడక దారిద్ర్యాది కష్టసహిష్ణుతకై పురుషులతో వంతుకు రావలసియుండును. భయముచే క్రుంగి పోకున్నచో స్త్రీలు సర్వవిధముల పురుషుల నతిక్రమింప జాలుదురు. చావునకు తెగింపవలెనే గాని ఎంతటి దుర్బల స్త్రీయైనను మానరక్షణ మొనర్చుకొనగలదు (21-7-1921, 11-8-1921, 15-12-1921).

"పతితలగు మన తోబుట్టువులు" అనుపేర గాంధి 15-9-1921న ఒక వ్యాసము ప్రచురించెను. వందలాది పతిత స్త్రీలతో ఆంధ్రదేశమునను, బారిసాలులోను తాను చేసిన సంభాషణముల నందు వివరించెను. అందు గాంధిజీ

ప్రసన్న మధురౌదార్యమే కాదు; ఆయన యెడ ఆ పతితలకు గల విశ్వాసము గూడ గోచరించును. నూలు వడుకుట చేపట్టినచో గౌరవప్రదముగా నుండునని గాంధి వారి కుపదేశించెను. వారు ఆ మరునాడే ఆరంభింతుమని మాట యిచ్చిరి. పిమ్మట, స్త్రీలను సమ్మానింపుడనుచు పురుషుల నుద్దేశించి యిట్లు నుడివెను :—

"మన విప్లవోద్యమమున ఇట్టి పాపద్యూతమునకు చోటు లేదు. భారత వాసులగు స్త్రీ పురుషు లందరిని తోబుట్టువులుగా గణించుటే స్వరాజ్యము......స్త్రీత్వము దుర్బలతకు గాదు, ఉదారతకే చిహ్నము. కష్ట సహిష్ణుత, త్యాగము, వినయము, విశ్వాసము, వివేకము మున్నగునవి నేటికిని స్త్రీల సొత్తే. తాను అధిక ప్రజ్ఞాశాలినని పురుషు డెంత విర్రవీగినను ఆతని ప్రజ్ఞ స్త్రీజన సహజ వివేకమునకు తీసికట్టే యగును."

వివేక విశ్వాస సమంచితమగు సహధర్మాచరణము స్త్రీల సొమ్మని గాంధిజీ తొలుత నిజభార్య యందును, పిమ్మట భారత స్త్రీలోకమంతటను దర్శించెను.

౪

గాంధిజీ క్రియాశక్తి 1921 లో పరాంకోటి నధిష్ఠించెను. అమేయమగు ధర్మబలముచే ఆయన కయాచితముగ రాజకీయ రంగమున ప్రబలాధికారము సంక్రమించెను. ప్రజ లాయనను మహాత్ముడని, ఈశ్వరునివలె

బూజింపజొచ్చిరి. * డిసెంబరులో భారత కాంగ్రెసు కాయన సర్వాధికారి యయ్యెను. తన వారసును పేర్కొనెడి అధికారము కూడ ఆయనకు సంక్రమించెను. నిస్సపత్నమగు అట్టి నాయకత్వము లభించెను గాన ప్రజలచే నిక దొరతనముపై తిరుగుబాటు చేయించుటగాని, తన యభీష్టము వెంబడి ధర్మ ప్రచారము నారంభించుటగాని ఆయన చేతిలో నుండెను.

అట్లయ్యు, గాంధి ధర్మ ప్రచారమునకు బూనలేదు. ఆయన కట్టి అభీష్టమును లేదు. ధర్మప్రచారము మహనీయముకదా, గాంధి ఆపని కేల పూనుకొనలేదో! ఒకవేళ, అది భీరులక్షణ మనుకొనెనేమో? రెండు పక్షములును నిజమే కావచ్చును. ఇంతకు నొకరి ఆంతర్యము మన కెట్లు తెలియును; అందును గాంధిజీ ఆంతర్య మతి కోమలము, గంభీరమును. దాని నందరు నవగాహింపలేరు. అన్య సంప్రదాయమున బెరిగిన వారి కది మొదలే అంతు చిక్కదు. భారతభూమియందా సంవత్సర మెంతయో కథ నడచెను. దేశమెల్ల సంక్షుభిత సాగరమువలె నూగిపోయెను. ఆ మహా సంక్షోభమున చుక్కాను పట్టిన గాంధి హస్తము ఒకప్పుడును భయ సంకోచములచే చెదరక, నావను సూటిగా నడపగలిగెనో, లేదో చెప్పలేము. గాంధి చిత్తశుద్ధికి, మహనీయతకు అనురూపమైన చిత్తశుద్ధితో, పూజ్యతా భావముతో, నాయోపినంతవట్టు, యక్ష ప్రశ్నవంటి ఆయన ఆంతర్యమును విప్పిచెప్పుటకై యత్నింతును.

* అది అయుక్తమని గాంధి పలువిధముల వారించెను. చూ. 'యంగిండియా' జూన్ 1921.

## ౨౪

ఎంత చెట్టు కంతగాలి యన్నట్లు గాంధివంటి సర్వాధికారి పొరపడునేని దానివలని యనర్థము నపారమే యగును. గాంధిజీ కర్మ ప్రవృత్తి తీవ్రమై, ఆయన ప్రచారముచే ప్రజల చిత్తము లూగిపోవుచున్న కొలది ఆ యావేశమునకు గళ్లెమిడి వశీకరించుటయు, తన చిత్త స్థైర్యమును గాపాడుకొనుటయు దుర్ఘటము కాజొచ్చెను. కట్టు విప్పినంతనే విడివడి చెలరేగిన ప్రజాకోటికి దాక్షిణ్యమును, అనుద్వేగమును అలవరించుట మానవాతీతమైన పని. కావున చుక్కాను పట్టిన ఆ సాధు పుంగవుడు భక్తి నమ్రుడై, ఆ భారమంతయు నీశ్వరునిపై నిడెను. అప్పు డాభక్తునకు వినిపించిన అంతర్వాణి చుట్టును చెలరేగిన ప్రభంజన ఘోషతో కలసి వినిపించెను. ఆమాత్రమేని ఇతరులకు వినబడునో, లేదో!

గాంధికే యపాయమైన కలుగవచ్చును గాని విజయ గర్వమునకు పాల్పడుట మాత్రము కలుగదు. ఆ సహజ వినయ శీలుడు పూజా పురస్కారములచే బాధపడునే గాని, ఉబ్బి తబ్బిబ్బు కాడు. ఈ భూమిపై దొల్లి యెందరో భక్తులు, ద్రష్టలు పుట్టిరి గాని వారు ఈశ్వర సాక్షాత్కారమును, దివ్య దృష్టియు, నైజ మతాభినివేశమును లేని గాంధి వంటి నిర్మల చిత్తులగుట అరిది. ఆయన మోమున విజయ రేఖయు, హృదయమున గర్వ గంధమును పొడచూపవు. అందరి వంటి మానవ మాత్రుడే ఆయనయు.....

మహాత్ముడనిపించుకొను అభిలాష గాంధికి లేదు (ఆ పరమ వినయమే గాంధిని మహాత్ము నొనర్చినది).

"మహాత్ములను మాటను లోకవ్యవహారము నుండి తుడిచి పెట్టవలెను. భారత సజ్జను లందరితోపాటు నేను నీశ్వరుని ప్రార్థింతును. ఈశ్వరవాణి నెల్లరు వినగలరు. నా కంతకంటె నధికముగా ఈశ్వర సాక్షాత్కారము కలుగలేదు. అంతర్వాణిని విననేర్చినవారి కందరికి నీశ్వరుడు సాక్షాత్కరించును. నేను కర్షక మాత్రుడను. భారతమును, మానవ లోకమును ఆరాధింతును. నాకు క్రొత్త మతమును స్థాపించు కోరిక లేదు. నేను దర్శించిన సత్యమును విడనాడక కర్మాచరణ మొనర్తును. పాసుగు పడిన సనాతన సత్యములనే నేను వెలిగించిచూపుచున్నాను"(12-5-1920, 25-5-1921, 13-7-1921, 25-8-1921).

పాపభీతి తోడి అసిధారా వ్రతమును, వినయమును గాంధికి స్వభావ సిద్ధములు. శిష్టుడ నని వేర్పడి యుండుటయు, మంచి కొరకేనియు చౌష్ట్యమును సైచుటయు ఆయన యెరుగడు. "ప్రభుత్వ దాస్యమునుండి విడివడి, సత్యాగ్రహుల బంధనమున చిక్కుటయు దాసగే" యనెను. తనదేశ మన్య దేశములకంటె అధిక మన డాయన. ఆయన ప్రజారాధనము భారతదేశపు టెల్లల నతిక్రమించును. "నా దేశసేవ మానవ లోక సేవతో సమేళమగును. మానవత్వము, జీవకారుణ్యము నన్ను బ్రజారాధకుని జేసినవి. ఇతరులనుండి వేర్పడుట నా కభిమతము కాదు. భారత క్షేమము నర్థించి ఇంగ్లండుకు, జర్మనీకి నేను కీడు సేయజాలను. సామ్రాజ్య తృష్ణకు నాలోక

మున చోటులేదు. లోకారాధన బుద్ధి కొరవడిన వానికి నిజ ప్రజారాధన బుద్ధియు కొరవడును (16-3-1921).

మరి ఆయన అనుచరులకు గూడ నిట్టి ఔదార్యము, వినయము నున్నవో, లేవో? ఆయన శిష్యులు కొందరి చేతులలో ఈ ధర్మస్వరూపమెట్లు మారునో? వారి ప్రచారముచే నది మరియెన్ని వికారములంది ప్రజల కందునో!

---

7

# ప్రభంజన విజృంభణము

1921లో రాజకీయోద్యమ గమనము తీవ్రతర మగుటచే ఆ సంవత్సర మంతయు కుదుపులతో డోలాందోళనలతో అనిశ్చయముతో నిండి గాంధినికూడ కలత పెట్టెను.

౧

ప్రజల తిరుగుబాటుతో ప్రభుత్వ పశుబల ప్రయోగమును, దానిచే తిరుగుబాటును తీవ్రమగు చుండెను. నాసిక మండలములోని మాలె గ్రామమున దొమ్మి పోరులును, అందు రక్తపాతమును తటస్థించెను. బీహారు రాష్ట్రమున గిరిధీలో గూడ అలజడి చెలరేగెను. అస్సాము రాష్ట్రమున మే నెల ఆరంభమందే దారుణ చర్యలు సంఘటిల్లినవి. తేయాకు తోటలలో అచట 12,000 కూలీలు పని చాలించుకొనుటయు, గూర్ఖా సైనికులు వారి నాక్రమించుటయు జరిగెను. ఆ దారుణ చర్యను నిరసించి తూర్పు బెంగాలులో రైల్వే పనివాండ్రును, పొగయోడలలోని పనివాండ్రును, రెండు నెలలుగా పని మానుకొని భీష్మించిరి. గాంధి అంతట రాజీ యత్నము లారంభించి, వైస్రాయి రీడింగు ప్రభువుతో మంతన ముండెను. దౌర్జన్యమును పురికొల్పు ప్రసంగములు చేయకుండ ఆలీ సోదరులతో రాయబారము నెరపి, 'అట్టి

ప్రసంగములకిక జోరము' అని ఆలీ సోదరులచే బహిరంగముగా చెప్పించెను.

ప్రజల తిరుగుబాటు మాత్రము మందగింపక సాగుచునే యుండెను. భారత ముస్లిములు ప్రజోద్యమము నింకను తీవ్ర మొనర్ప సిద్ధమగుచుండిరి. 8-7-1921న కరాచిలో ఖిలాఫతు మహాసభ సమావేశ మాయెను. ఆ సభలో "భారత ముస్లిములు ప్రభుత్వ సైన్యమున జేరుటయు, ఇతరులను చేర్పించుటయు అపరాధ" మని ప్రకటించుటే కాక, ఆంగ్ల ప్రభుత్వము అంగోరా ప్రభుత్వముతో యుద్ధమునకు దిగునేని భారత ముస్లిములు స్వాతంత్ర్యమే తమ లక్ష్యమని ప్రకటించి, శాసనోల్లంఘనమునకు గడంగుదురని బెదరించుట కూడ జరిగెను. అప్పటికే నూతనముగా సంఘటితమైన భారత కాంగ్రెసు సభ 28-7-1921న బొంబాయిలో సమావేశము జరపెను. భారతదేశమున కేతెంచుచున్న వేల్సు యువరాజుకు ప్రజ లెవ్వరును స్వాగతము చెప్పగూడదనియు, 30వ సెప్టెంబరు నాటికి వైదేశిక వస్త్రములను పూర్తిగా విడనాడి, వడుకు నూలు వస్త్రములను చాలినంత ఉత్పత్తి చేయవలెననియు ఆ సభలో కార్యనిశ్చయము జరగెను. ప్రభుత్వాలంబనముతో జరుగుచున్న మద్యపానమును గూడ పూర్తిగా నిర్మూలించుటకై కాంగ్రెసు నిశ్చయించెను. ఖిలాఫతు సభవలె కాంగ్రెసు సభ తొందరపడక, దేశమునందలి దౌర్జన్యకాండను నిరసించి, అహింసాచరణమును పదేశించి, శాసనోల్లంఘనమున కిది సమయము కాదని హెచ్చరించెను.

౨

ఆగస్టు నెలలో మాప్లా విప్లవము చెలరేగి నెలల తరబడి సాగెను. మౌలానా మహమ్మదాలీతో గాంధి మలబారున కరిగి మాప్లాలను శాంతింప జేయనెంచెను. కాని ప్రభుత్వము అందుల కనుమతింపక సెప్టెంబరులో కొందరు ముస్లిము నాయకులను, ఆలీ సోదరులను నిర్బంధించెను. ఖిలాఫతు మహా సభలో రాజద్రోహ నిశ్చయము సల్పిన నేరమును వారిపై నారోపించెను. వెను వెంటనే ఖిలాఫతు స్థాయి సంఘ సభయందును, మరియు ననేక ముస్లిము సభలలోను ఆ రాజద్రోహ నిశ్చయమును పునరుద్ఘాటించిరి. అక్టోబరు 4 న గాంధి కూడ ఆలీ సోదరుల కార్య నిశ్చయముతో తానును ఏకీభవించినట్లు ప్రకటించెను. మరి ఏబదిమంది కాంగ్రెసు నాయకులతోగూడ గాంధి చేసిన ఆ ప్రకటనము ఆంగ్ల ప్రభుత్వము భారతీయ సంపదను హరించి ప్రజలను పరతంత్రతలో, అవినీతిలో ముంచెను గాన అట్టి ప్రభుత్వపు టుద్యోగి యగుటయు, సేనలో చేరుటయు భారతీయులకు తగదని చెప్పెను. ఆ ప్రభుత్వముతో సహకరింప నిరాకరించుట ప్రజలకు ధర్మమనెను. ప్రభుత్వమేమో ఆలీ సోదరులకు రెండేండ్ల కఠిన వరకము విధించెను. అందులకు బ్రతిగా ప్రజల విప్లవచర్య లినుమడించెను. దేశమునందలి ప్రతి రాష్ట్రమును సొంత బాధ్యతమీద శాసన ధిక్కారము సల్పవచ్చుననియు, పన్నుల నెగబెట్టుటతో శాసన ధిక్కారము నారంభింపదగుననియు కాంగ్రెసు కార్య నిర్వాహణ సభ తెగువమై కార్య

వినిశ్చయ మొనర్చెను. అట్లు శాసనములను ధిక్కరించు వా రందరు ముందుగా స్వదేశ వ్రతమును, ఖద్దరు ధారణమును, అహింసను త్రికరణయా ఆచరించవలెనని నిబంధనము గూడ విధించెను. గాంధి ఈ విధముగా విప్లవమును నియమ నిగ్రహములతో, ఆత్మార్పణ బుద్ధితో సమన్వయింప జూచెను. ఈ యాత్మార్పణము నిష్కామముగా నుండవలెను గావున శాసన ధిక్కారులు తమ తమ కుటుంబములకు కాంగ్రెసు ధన సహాయ మొనర్చునను ఆశ పెట్టుకొన వలదని కూడ కాంగ్రెసు సభ స్పష్టపరచెను.

3

నవంబరు 17 న వేల్సు యువరాజు బొంబాయిలో నడుగు పెట్టుటతో ఈ మహా విప్లవమునకు నాంది పఠించి నట్లయ్యెను. సామాన్య సంసారులును, పేదలును యువరాజ స్వాగతోత్సవమును వెలివేసిరి. పారసీకులు మున్నగు ధని కులును, రాజపురుషులు నీ ఆంక్షను పాటింప రైరి. ప్రజా సమూహ మట్టి ధనికులను, వారి స్త్రీ జనమును గూడ చుట్టు ముట్టి ఆగడము లొనర్చెను. ఈ కల్లోలము పట్టణ మంతట వ్యాపించి దోపిడులు సాగెను. పలువురు మరణించిరి. అనే కులు గాయపడిరి. ఈ హింసాకాండ ఒక్క బొంబాయిలోనే ఘటిల్లెను గాని తక్కిన దేశమంతట హర్తాలు శాంత గంభీ రముగా జరిగెను. "ఈ బొంబాయి అల్లరులు గాంధి హృదయ మున బాణము వలె నాటుకొనెను." అలజడి ఆరంభ మయ్యెనని తెలియగనే గాంధి ఆ ప్రదేశమున రివ్వున

వ్రాలెను. తన్ను గాంచి ప్రజ లానందపరవశు లగుట చూచి గాంధి సిగ్గున క్రుగ్గిపోయెను. గాంధి యంతట వారిని పరుషముగా మందలించి, చెదరిపొండని చెప్పెను. యువరాజుకు స్వాగతము చెప్పి స్వాతంత్ర్యము పారసీకులకు గలదనియు, వారి నడ్డగించెడి ఈ దుండగము క్షంతవ్యము కాదనియు ప్రజలకు వివరించి చెప్పెను. ప్రజాసమూహ మంతట నిరుత్తరమై విచ్చిపోయెను గాని మరికొన్ని దూరపు పేటలలో మరల దుండగము తలయెత్తెను. ఆతతాయులగు దుర్జనులెట నుండియో బయల్వెడలి వచ్చిరి. అట్లు చెలరేగిన ఇరువదివేల జనసమూహము నొక్కపెట్టున అరికట్టుట దుర్ఘటము. అట్లయ్యు, విపరీతములగు దారుణక్రియ లంతగా జరుగలేదు. మన దేశములందలి విప్లావక దుశ్చర్యలందు చిరుతపాలునకేని అవి పోలవు. గాంధి కాలు చేయాడక బొంబాయి పౌరులకు, తన అనుచరులకు విన్నపములపై విన్నపము లొనర్చెను. ఈ దుశ్చర్యల మధ్య సాముహిక శాసన ధిక్కారము ప్రవర్తిల్లుట సాధ్యము కాదని చెప్పి శాసన ధిక్కారోద్యమమును గాంధి ఉపసంహరించెను. ఇతరులు సల్పిన యీ దుండగములకు ప్రాయశ్చిత్తముగా వారమున నొక దిన మాయన ఉపవాస వ్రతము విధించుకొనెను.

బొంబాయిలో జరిగిన ఈ దుండగములకంటె దేశమంతట ప్రశాంతముగా ప్రవర్తిల్లిన హరతాళమే భారత దేశ మందలి పాశ్చాత్య హృదయముల నెక్కువగా కలవర పెట్టెను. ఇక ఉపేక్షింపదగదని వైస్రాయిని వారు తొందర పెట్టిరి. వెంటనే రాష్ట్ర ప్రభుత్వము లన్నియు శాసన సమ్మ

తములుగాని తీవ్ర చర్యలకు గడంగెను. అరాజకులను, రహస్య విప్లావక సంఘములను అణచుటకై 1908 లో చేసిన శాసనాయుధమును కాంగ్రెసు వలంటీర్ల సంఘములపై ప్రయోగించిరి. తత్ఫలితముగా వేలకొలది క్రొత్త వాలంటీర్లు ఆ సంఘములో చేరజొచ్చిరి. రాష్ట్ర కాంగ్రెసు సంఘము లా వాలంటీర్ల సంఘములను నియమ సంఘటితము లొనర్ప జొచ్చెను. డిసెంబరు 24 న యువరాజు కలకత్తాకు వచ్చి నపుడు హరతాళము సలుపవలెనని కాంగ్రెసు ఆదేశించెను. ఆ నాడు యువరాజు ప్రవేశించిన కలకత్తా నగరవీథులు జన శూన్యములు, దుఃఖసూచకములునై, మూగనోము పట్టిన ట్లుండెను.

ప్రతిఘటనోద్యమము తీవ్రతర మగుచున్నట్లున్న ఆ రోజులలోనే కాంగ్రెసు మహాసభ అహమదాబాదులో సమావిష్ట మయ్యెను. ఫ్రాన్సులో 1789 లో జరిగిన సేనానుల సభ నది జ్ఞప్తికి దెచ్చును. సభాధ్యక్షుడా జెయిలు ఖానాలో నుండెను. దీర్ఘ ప్రసంగములా, లేవు. అంతకు మున్ను కాంగ్రెసు చేసిన విజ్ఞాపనము లెల్ల ఆ సభ పునరుద్ఘాటించి, గాంధికి యావద్భారతముపై సర్వ స్వతంత్రాధికార మిచ్చి, ఆయన అనంతర వారసును నియమించే అధికారము గూడ సంక్రమింపజేసెను. ఆ పిమ్మట కొన్నాళ్లు భారతభూమి యంతట ధర్మోత్సాహము తాండవించెను. ఇర్వదియైదు వేలమంది స్త్రీలు, పురుషులు స్వయముగా నిర్బంధమును వరించి కారాగారములు ప్రవేశించిరి.

గాంధి మరల సామూహిక శాసన ధిక్కారమున

కుద్యమించెను. గాంధి ధర్మము బర్డోలి తాలూకాలో బాగుగా పాదుకొన్నది కావున అచటనే ధర్మసమరము ప్రారంభింప నిశ్చయించెను. ఈ నిశ్చయమును గాంధి ముందుగనే వైస్రాయికి సగౌరవముగ తెలియజేసెను. సమరారంభమునకు వారము దినములు వ్యవధి యిచ్చి ఈ లోపల ప్రభుత్వము మంచి దారికి రానిచో ధర్మ సమరభేరి మ్రోగునని విన్నవించెను. *

౪

గాంధి ఈ జాబును వైస్రాయికి పంపుటే తడవుగా అంతకు మున్నెన్నడు జరుగని యంత హింసాకాండ చౌరీ చౌరాలో ప్రవర్తిల్లెను. అచట ప్రజల యూరేగింపును పోలీసు లడ్డగించిరి. ప్రజ లంతట పోలీసుల నాక్రమింపగా వారు తుపాకులు ప్రేల్చి స్టేషనులో దూరిరి. ప్రజ లా స్టేషనుకు చిచ్చు ముట్టించి పోలీసుల నంత మొందించిరి.

ఈ హింసాకాండతో సత్యాగ్రహ వలంటీర్ల కెవ్వరికిని సంబంధము లేదు. కావున గాంధి తన కట్టి బాధ్యత లేదని చెప్పవచ్చును కాని భారతభూమి పాపపుణ్యముల భారము నప్పటికే ఆయన తనపై వేసికొనెను. ఎవరి పాప

* ఈ సంకల్పము నానాతే 'యంగిండియా'లో కూడ ప్రకటించి, వైస్రాయి రాజీకి రానిచో శాసన ధిక్కారము నలుపవలెననియు, ప్రజలలో అధిక సంఖ్యాకు లందులకు గలసిరాకున్నను ధిక్కారోద్యమము సాగించవలసినదే అనియు ఆదేశించెను (4-9-1922).

మేనియు ఆయనకు సంతాపకారియే. ఈ కారణమున ఆయన భగ్నాశుడై శాసన ధిక్కారోద్యమమును రెండవమారు ఉపసంహరింపవలసిన వాడయ్యెను. బొంబాయి దుండగముల నాటికంటె ఇప్పటి దురవస్థ మరియు బాధాకరమై తోచెను. కయ్యమునకు గాల్డ్రివ్వి వైస్రాయికి వార్త నంపితినే, ఇపుడు వెనుదీసినచో నగుబాటు కదా యను అభిమాన పిశాచము ఆయనను వెన్నాడజొచ్చెను. కాని ఆ ధీరు డద్దానికి లొంగకుండుటకే తన అపజయమును బహిరంగముగా ప్రకటించెను.

"నే నపరాధిని" అనుచు ఫిబ్రవరి 16న 'యంగిండియాలో' గాంధి వ్రాసిన మాటలు తన్మహనీయ చరిత్ర నుట్టంకించు వ్రాతలలో అపరూప మనదగును. సంతాపావమాన నిర్మగ్నమగు గాంధి హృదయమునుండి తొలుత వెలువడిన మాట లివిగో! పరమేశ్వరుడు తన్నవమానమున ముంచి అనుగ్రహించెనని ఆనందముచే నెట్లు కొనియాడుచున్నాడో—"పరమేశ్వరునకు నా యందెంత అనుగ్రహమో కదా! సామూహిక శాసనోల్లంఘన మొనర్చుటకు దగిన అహింసా ప్రవృత్తి భారత ప్రజల కింకను అలవడలేదని మూడవతూరి నన్నిట్లు హెచ్చరించెను. 1919 లో రౌలటు శాసనాందోళన వేళ అహమదాబాదు, వీరంగాం, ఖేడాలలో, అమృతసరం, కసూరులలో జరిగిన దుండగముల మూలమున నన్ను మొదటిసారి హెచ్చరించెను. నేను వెనుకంజ యిడి, హిమాలయోన్నతమగు నా దోషమునకు వగచి, ప్రజల యెదుటను, ఈశ్వరుని సన్నిధిని తల వాల్చుకొంటిని. సామూహిక సత్యాగ్రహమునే కాక అహింసా ప్రయుక్త

ముగా నేను చేయబూనిన శాసనోల్లంఘనమును కూడవిర మించితిని. మరల బొంబాయిలో అంతకంటె దారుణమగు కనువిప్పు నీశ్వరుడు నా కనుగ్రహించెను. అచటి దుండగీంద్ర హింసాకాండ నాకు ప్రత్యక్ష మొనర్చెను. అచటి మూకలు సహాయ నిరాకరణము కొరకే అట్టి దుండగములకు దొడ గెను. నే నంతట సామూహిక శాసనోల్లంఘనమును విర మించుకొని 1919 నాటి కంటె అధికమగు తలవంపుల కగ్గ మైతిని. అది నా మేలునకే యైనది. భారత ప్రజలకు కూడ నది మేలే చేకూర్చెను. ఆ విరమణముచే భారతదేశము సత్యాహింసలనే ఆశ్రయించి నట్లయినది. మరి నేటి యీ తలవంపుల నేమనవలెను? చౌరీచౌరా హింసాకాండలో ఈశ్వరవాణియే వినబడినది. భారతభూమి అహింసనే నమ్ము కొని తద్ద్వారముననే స్వాతంత్ర్య సింహాసనము నధిష్ఠింప గోరునేని అల్లరిమూక లెట్టి కారణముచేనైన రెచ్చిపోవుట దుశ్శకునమే యని గ్రహింపవలెను. దేశములోని దుండ గీంద్ర నదుపు చేయగలిగిననాడే అహింసా ప్రయుక్తమగు శాసనోల్లంఘనము జయించగలదు.''

ఫిబ్రవరి 11 న కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘము బర్డోలీలో మరల సమావేశమైనపుడు గాంధి తన అంత స్తాపమును తెలుపగా ఆయన సహచరులలో చాలమంద కది రుచింపదయ్యెను. ''కాని ఈశ్వరానుగ్రహముచే నా సంశయాందోళనములు వారి మనస్సున కెక్కుటయు, సత్యా గ్రహ విరమణ కంగీకరించి, దేశమున పరిపూర్ణమగు అహిం సను నెలకొల్ప నిశ్చయించుటయు జరగెను.''

"రాజనీతిజ్ఞులీ ఉద్యమ విరమణమును దోషముగా పరిగణింతురే కాని ధర్మదృష్టి కిందు దోషము కన్పింపదు. చేసిన తప్పు నొప్పికొని తలవంచుకొనుటచే దేశమునకు మేలే యగును. మానవాతీతములగు మహిమ లేవియు నాకడలేవు. నా కవి వలదు. సత్యాహింస లనుసుగుణము లున్నచో నాకు జాలును. మానవ మాత్రులలో దుర్బలాతిదుర్బలులతో పాటి వాడనే నేనును. వారివలెనే నేనును ప్రమాదములకు లోన గుదును. నా చేయగల సేవ పరిమితమే యైనను దోష భూయిష్ఠమగు ఆ సేవనే ఈశ్వరు డనుగ్రహ దృష్టిచే ఇందనుక వీక్షించెను.........అపరాధము జరగెనని ఒప్పి కొనుట పెంటపోగును చిమ్మివేయుట వంటిది. ఆ ఒప్పుదలయే నాకు పుష్టి నిచ్చును. వెనుకంజ వేయుట ఉద్యమమునకును పుష్టినిచ్చును. తిన్నని మార్గమువదలి వంకర త్రోవలనే నడచి గమ్యమును పొందిన వా రెవ్వరును లేరు......... చౌరీచౌరాచే బర్డోలీ ఉద్యమునకు నష్ట మేమని కొంద రందురు. చౌరీచౌరాను చూచి బర్డోలీ కూడ హింసకు లోగినపుడు కదా మనము భయపడవలసినదని వారు చెప్ప వత్తురు. బర్డోలీ వాసు లట్లు లోగిపోవు దుర్బలులు కారనియు, శాంతచిత్తు లనియు నేను బాగుగా నెరుగుదును. నిజమే కాని ఈ మహాదేశమున బర్డోలీ యన అరచేయంత కూడ నుండదు. అట్టిచో తక్కిన యావద్దేశము దాని పూన్కికి తోడ్పడనిచో అది జయింపజాలదు. కుండెడు పాలలో పడిన ఒక విషబిందువుచే పాలన్నియు చెడినట్లు చౌరీచౌరా హింసతో బర్డోలీ అహింస సర్వమును వమ్మగును. దేశములో

నున్న హింస చౌరీచౌరాలో ప్రకోపించి ప్రస్ఫుటమైనదే కాని వేరు కాదు......అహింసా సమరమునకు, ఆవేశమునకు బొత్తు కుదురదు. పల్లెత్తక బాధను సహించు నేర్పును శాసనోల్లంఘనము శిక్షించును. సాత్త్వికమై, కంటికగపడదు గాని దాని ఫలితము పరమాద్భుతము. చౌరీచౌరా దుర్ఘటన అశుభమును ప్రేలెత్తి చూపుటకే. మన యహింస నుండి హింస పొడమకుండ చేయవలెనన్నచో మనము వెంటనే వెనుకకు తగ్గి, దేశమంతట శాంత్యహింసలను నెలకొల్పి, క్రొత్తగా వ్యూహరచన సేయక తప్పదు. శాసనోల్లంఘన సమయమున ప్రభుత్వ మెంత రెచ్చగొట్టినను హింస తలచూపదు అను నమ్మకము కుదురువరకు మనము మరల శాసనోల్లంఘన యత్నము తలపెట్టగూడదు. మన అపజయమును, అవమానమును గాంచి విరోధు లుప్పొంగిపోనిండు. మనము ప్రతిజ్ఞా భంగమును, ఈశ్వర ద్రోహమును చేయుటకంటె పిరికిపందలము, దుర్బలులము, అనిపించుకొనుటే మేలు......" ఆ పిమ్మట గాంధి ఇతరుల దోషమునకు తాను ప్రాయశ్చిత్తము విధించుకొనుచున్నాడు.

"ఆత్మశుద్ధికై నేను ప్రాయశ్చిత్త మొనర్చుకొనవలెను. ఈ యుపాధి ఇంకను నిర్మలమై తన చుట్టునున్న ధర్మాధర్మములను తనలో ప్రతిఫలించు కొనవలెను. ఈశ్వర ప్రపన్నతకు చాలినంత నైచ్యాను సంధానమును, సత్యస్థిరతయు నా కింకను అలవడవలసి యున్నది."

తా నైదునాళ్ల ఉపవాసము విధించుకొని ఇతరు లెవ్వరు ఆపని పూనవలదని నిషేధించెను. నిపుణత చాలని శస్త్ర

వైద్యమునకు పూనుకొన్న తనకే ప్రాయశ్చిత్తము గాని ఇతరులకు గాదు. తా నింతకంటె దృఢమైన పుణ్యము సంపాదించుటో, శస్త్రములు వదలి చేతులు జోడించుటో జరుగవలసి యున్నది. ఈ ఉపవాసము తనకును, బహుశః తన పేరు జపించుచు, చౌరీచౌరాలో పాపకర్మ మొనర్చిన వారికి గూడ దండనము, ప్రాయశ్చిత్తము వంటిది. వారి యందరి బదులు తానే ఈ బాధ ననుభవింతుననియు, వారందరు చేసిన తప్పు నొప్పికొని ప్రభుత్వమున కధీనులు కావలెననియు కోరెను. మేలు సేయనెంచి వారీయుద్యమమునకు మహాద్రోహ మొనర్చి రనెను.

"నా మట్టుకు నే నెంతటి పరాభవమైన నోర్చి, ఎట్టి బాధలైన భరించి, లోకమెల్ల నన్ను రోసి విడిచినను సహించి, మృత్యువున కేని శిర మొగ్గి ఈ యుద్యమము హింసా కళంకితము గాకుండ రక్షింతును."

———

# 8

# నిర్బంధము - కోర్టు విచారణ

ఇంత సమ్మాన్యము, నుదారమునగు ధర్మ చింతన మును, చిత్తశుద్ధియు మానవేతిహాసమున మృగ్యము. ఇట్టి చేతచే అపారము, నద్భుతమునగు చిత్త సంస్కారము ప్రజ లకు లభించి తీరును. నిజమే కాని రాజనీతి విదుల కిది దిగ్భ్రమ కల్పించును. తాను చేసిన పని రాజనీతిదృష్ట్యా అవిచారి తము, అసంబద్ధముగా నెంతురని గాంధియు నెరిగినదే. సాహసారంభమున కిదిగో, అదిగో తరివచ్చు చున్నదని ప్రజలు ఉత్కంఠితులై, ఊపిరి బిగ్గబట్టునట్లు చేసి, వీరావేశము కల్పించి, రణభేరి సరచుటకు చేయెత్తినట్లే యెత్తి, అంతలో దించివేయుటయు, ఆశాప్రచోదితమై, కదలబారుచున్న మహా యంత్రమును హఠాత్తుగా, ఒక్క సంవత్సరము లోపలనే, మూడుసార్లు నిలిపివేయుటయు నెంతయేని అపాయ కారి యగును. ప్రజల ఆశయు, ఉత్సాహమును చప్పగా చల్లనారిపోయెడి ప్రమాద మందు కలదు.

పిమ్మట ఫిబ్రవరి 24 న కాంగ్రెసు సంఘ సమావేశము ఢిల్లీలో జరగినపుడు బర్డోలీ నిశ్చయము నామోదింప జేయుట దుర్ఘటమై పోయెను. సత్యాగ్రహిదళము చీలి పోయినట్లు స్పష్టపడెను. మరల సత్యాగ్రహ మారంభించు టకు ముందు కాంగ్రెసు వాహినులు సుసంఘటితములై, నియమపాలన మలవరచుకొనవలెనని గాంధి కోరెను. అందు

లకు సాధనముగా నిర్మాణకర్మ కలాపమును విధించెను. ఈ మందగమనము గాంచి చాలమంది కొరకొరలాడిరి; శాస నోల్లంఘ నోపసంహారము తమకు సమ్మతము కాదనిరి. ఈ మందగతిచే, ఈ సంశయాందోళనలచే ప్రజల ఉత్సాహా వేశములు చల్లారు ననిరి.



వాదోపవాదములు నడచిన మీదట గాంధి మాటయే తుద నెగ్గెను గాని ఆయన చాల మనస్తాపము పాలయ్యెను. తన్ను బలపరచిన వారైనను మనసార తనతో ఏకీభవించిన వారు కారనియు, తన యభీష్టము వెంట చేతులెత్తిన వారే ఆవల తన్ను నిరంకుశు డని నిందింతురనియు ఆయనకు తెలియును.

"సభ్యులలో చాలమందికి, తెలిసియో తెలియకయో, హింసాబుద్ధి అంతర్గతముగా నున్నదని యెరిగినవాడను గాన ఆ సభలో నేను చప్పగా ఓడిపోవలెనని మనసార కోరి ప్రార్థించికొంటిని. ఏ కొలది మందియో తప్ప బహుజనము నా వెంటవచ్చు టెన్నడును లేదు. దక్షిణాఫ్రికాలో మొదట నా మతమును సర్వులు అంగీకరించినట్లే అంగీకరించి తదుపరి నావెంట అరువది నల్వురు, ఆ వెనుక పదియార్గురే మిగిలిరి. మరల నొకపరి బహుజనులు నావెంట వచ్చిరి. ఈ వివరము లందరు నెరుగరు. అచటి మంచిపనియు, గట్టిపనియు నేమేని జరిగినచో అదియెల్ల కొలదిమందితో నే నొంటరినై యున్న

పుడే జరిగినది. ఇచటి బహుజనులు నావెంట నున్నట్లే కన్పింతురు. దీనిని చూచియే ప్రభుత్వము భయమందు చుండును. ఈ బహుజనమును జూచి తమకంటె నే నెక్కుడు భీతిచెందుచుంటినని ప్రభుత్వమునకు దెలియదు. నాకు లభించిన సర్వస్వతంత్రతను దుర్వినియోగ మొనర్చుచుంటినని కూడ మిత్రు డొకడు నన్ను మందలించెను. ఒకవేళ, నాకు దెలియకుండ నేనే ప్రజలచేతి కీలుబొమ్మ నగుచుంటినేమో యని నేనును అక్కజపడుచుంటిని. తొల్లిటికంటె నా కీవిషయమై భయ మధికమైనది. నే నొకరిమాట వినువాడను కానని కాంగ్రెసు కార్యనిర్వాహకులగు నా మిత్రులతో చెప్పనే చెప్పితిని. ప్రజలు తప్పు చేసినపుడెల్ల నేను వానిని వెల్లడించుచునే యుందును.

"నే నిపుడు విషాదముచే క్రుంగుచున్నను తొల్లిటికంటె నాకు వివేకోదయమైనది. అంతరాత్మకంటె నన్నాదేశించు ప్రభువు లెవ్వరు లేరు. అందరు విడనాడి నన్నేకాకి నొనర్చినను నేను భయపడబోను. ఆ చిత్తశుద్ధియే నాకాదరవు. మన అహింస చర్మగతము మాత్రమే యని తెల్లమైనది. మనము కోపముచే మండిపోవు చున్నాము. ప్రభుత్వము తన అవివేక చర్యలచే ఆ మంట నెగసన ద్రోయు చున్నది. ఈ దేశమున హత్యలు, గృహదహనములు, దోపిడిలు చెలరేగవలెననియు, వానిని మట్టుపెట్టు నేర్పు తనకే గలదని మరల రుజువు చేయవలెననియు ప్రభుత్వము కోరు చున్నట్లు కన్పించుచున్నది. మన అహింస అశక్తి ప్రయుక్తమని తేలినది. పగ తీర్చుకొనుటకు వీలెపుడు చిక్కునా యని

మనము ఉవ్విళులూరు చున్నట్లు తోచుచున్నది. అశక్తులువిధి లేక అవలంబించిన ఈ యహింసనుండి అవ్యాజాహింస ఎట్లు పొడమగలదు? నేను చేయుచున్న ఈ యత్నమంతయు వ్యర్థమే కదా? తీరా, దేశమున ఈ క్రోధపాపము బ్రద్దలై స్త్రీ బాల వృద్ధముగా ప్రజలు పరస్పరము కుత్తుకలు కోసి కొనుటకు కత్తులెత్తి, భయభ్రాంతులై నపుడు నేను ఆ మరణ ప్రాయోపవేశము చేసి ఏమి ప్రయోజనము?...... ఇంకను ఈ కపట నాటక మెందులకు? హింస వల్లనే మనకు స్వాతంత్ర్యము కావలసియున్నచో ఈ యహింసను విడనాడి, చేతనైన హింసనే చేపట్టుట మేలు. అట్లు చేయుటయే పురుష లక్షణము; అదియే సరళము, సవిచారము నగు మార్గము. లోకమున చిరకాలముగా ప్రవర్తిల్లుచున్న మార్గము కూడ నదియే. మనము వంచకులమనే ఈ ఘోర నింద కూడ అపుడుండదు......శాసనోల్లంఘనమును కట్టి పెట్టి నిర్మాణ కర్మ మొనర్చుట కిపుడు బహు జనులు కట్టు వడిరి.... మన కాలిక్రింద పట్టు తప్పిపోయినది. మనమిపుడు హెచ్చరికమై నుండనిచో లోతు తెలియని అగాధ జలముల పడిపోదుము."

ప్రతిపక్షము వహించిన వారి నుద్దేశించి ఏమనెనో చూడుడు :—

"మీకు అహింసపట్ల విశ్వాసము లేనిచో కాంగ్రెసును విడనాడిపోయి, క్రొత్త పక్షమును స్థాపింప వచ్చును గదా? అట్లు స్థాపించి మీ ఆంతర్యమును ప్రజలకు వెల్లడింపుడు. అపుడు ప్రజ లెవరిని వరింతురో తేలిపోవును. మనసు

మర్మములు, మాట దాపరికములు నెందుకు?''

ఈ పరుషవాక్యము లా ధీరుని విషణ్ణ హృదయమును పట్టి యిచ్చుచున్నవి.

గాంధి యిక కారాగారమును ప్రవేశింపనున్న తరుణమది. ఆ నిర్బంధమే తనకు విడుమరయని ఆయన సంతోషించెనేమో ఎవరి కెరుక?

౨

నిర్బంధ మేనాడు వచ్చునో యని 10-11-1920 నుండి ఆయన అందులకు సంసిద్ధుడుగానే యుండెను. తన్ను నిర్బంధించిన పిమ్మట ప్రజ లేమి చేయవలెనో ముందే చెప్పి పెట్టెను. 9-3-1922 న నిర్బంధము నేడో, రేపో తప్పదని తెలిసి, ప్రజలకు మరల కర్తవ్య ముపదేశించెను. ప్రభుత్వ హింసా కాండకు తాను భయపడననియు, ప్రజలు వశము తప్పిపోదురను భయమే తన్ను బాధించుచున్నదనియు అట్టిది తటస్థించినచో తా నప్రతిష్ఠ పాలగుదు ననియు చెప్పెను.

''నన్ను నిర్బంధించిన దినమును ప్రజలు పండుగగా నెంచుకొనవలెను. గాంధిని పట్టివేసినచో ఈ దేశముతో పోరు తీరిపోవునని ప్రభుత్వ మనుకొనుచున్నది. ప్రభుత్వమున కా భ్రాంతిని పోగొట్టవలెను. ప్రజల శక్తి ఎట్టిదో ప్రభుత్వము చవిచూచు గాక!''

నిమ్మకు నీరెత్తినట్లు దేశము శాంతముగా నుండుటే తనకు పరమ గౌరవ మొనర్చినట్లు. గాంధిని బంధించినచో దేశమున నేమి అలజడి పుట్టునో, రక్తపాతమే జరుగునో

యని ప్రభుత్వము భయపడుట తనకు అవమానము గూర్చును. ప్రజ లెవరి పనులు వారు చేసికొనుచు, సభలు సంభాషణలు చేయక, శాంతముగా నుండవలెను. న్యాయస్థానములను త్రొక్కి చూడకుడు. ప్రభుత్వోద్యోగములు సేయకుడు. ప్రభుత్వ కళాశాలలలో అడుగు పెట్టకుడు. నియమ నిగ్రహములతో నిర్మాణ కర్మ కలాపమున నిమగ్నులు కండు. ప్రజ లిట్లు ఆచరింతురేని జయలక్ష్మి సమీపించును. కానినాడు భారతము చిదుక గొట్టబడుట తథ్యము.

ఇట్లు ఏర్పాటు లన్నియుచేసి గాంధి సబర్మతి ఆశ్రమమున కేగి, అచట తన శిష్య బృంద మధ్యమున తన్ను నిర్బంధింప వచ్చువారికి స్వాగతము చెప్పుటకై వేచియుండెను. నిర్బంధము ఆయన కోరి తెచ్చుకొన్నదే. భారతాత్మ ప్రత్యయము తన పరోక్షమున బాగుగా వ్యక్తమగు ననియు,—మరి తన మాటయా ?—తనకు దుర్లభమైన విశ్రాంతి లభించు ననియు ఆయన ఆశపడెను.

3

మార్చి 10 వ తేది సాయం ప్రార్థనము ముగిసిన పిమ్మట పోలీసుద్యోగులు వచ్చి ఆశ్రమవాసులకు తమ రాక నెరిగించిరి. మహాత్ముడు స్వయముగా వారికి హస్తగతుడయ్యెను. తనకోసము చాలదూరమునుండి ప్రయాణముచేసి వచ్చిన మిత్రుడు హాజరత్ మోహానీని కారాగారమున కేగు దారిలో కలిసి కౌగిటజేర్చి వీడ్కొనెను. 'యంగిండియా'

ప్రకటనకర్త బాంకరుతో గూడ గాంధి కారాగృహమున ప్రవేశించెను. గాంధి యిల్లాలు జెయిలు వాకిటివరకు వచ్చి సాగనంపెను.

మార్చి 18 న అహమ్మదాబాదు జిల్లా కోర్టులో ఈ 'మహావిచారణ' ప్రారంభ మయ్యెను. విచారణ న్యాయముగా, ఉదారముగా నడచెను. జడ్జియు, అపరాధియు ఒకరిని మించి యొకరు పరస్పర బహుమానాదరములతో మెలగిరి. ఆ విచారణ సమయమున ఇగ్లండు నెఱపినంతటి ఔదార్యము, తాటస్థ్యము నాపోరితములో మున్నెన్నడు వహించి యెరుగదు. జడ్జియగు సి. యన్. బ్రూంఫీల్డు వైఖరిచే ప్రభుత్వ మాచరించిన పూర్వకలుషము లెన్నియో క్షాళితములై పోయెను. ఆ విచారణ కథ యంతయు గాంధి మిత్రులు ప్రకటించిరి. అందు కొంత కొంత యూరపు పత్రికలలోని కెక్కెను. దాని ప్రతిధ్వనులు ఫ్రాన్సు దేశమున గూడ కొంత వినవచ్చెను. ఇంతకు ప్రభుత్వము గాంధి నెందుకు నిర్బంధించినట్లు? రెండేండ్లు వెనుక ముందాడిన ప్రభుత్వము—తీరా, మహాత్ముడు ప్రజల యుద్రేకమును అరికట్టుచుండగా, దేశములో చెలరేగు హింసాకాండ కాయన తప్ప మరొక చెలియలికట్ట కనుపించని సమయము చూచి మహాత్ము నెందులకు నిర్బంధించినట్లు? ఇది వట్టి తప్పటడుగనవలెనా? లేక "దేశము గృహదాహములతో, దోపిళ్లతో, రక్తపాతముతో ఎపుడు నిండునా, మన ప్రతాపము చూపి మట్టుపెట్టుట కెపుడు సందుదొరకునా యని ప్రభుత్వ మెదురు చూచుచున్నట్లున్న"దని గాంధి చెప్పిన

ఘోరవచనమే నిజమనవలెనా ? ఎటు చూచినను ప్రభుత్వ చర్య సమర్థనీయముగా లేదు. ప్రభుత్వమునకు గాంధిపట్ల భయము, గౌరవము కూడ ఉన్నమాట నిజము. గాంధి యెడ ఆదరము నెరపవలెనని ప్రభుత్వమున కున్నను, ప్రభుత్వము తన కోరికలు నిరాకరించినన్నాళ్లు దానియెడ గాంధి ప్రత్యాదరము నెరపజాలడు. మహాత్ముడు హింసను నిషేధించెను నిజమే కాని ఆయన అహింస హింసకంటె ప్రబల శక్తిసంపన్నము. ఫిబ్రవరి 23న సామూహిక శాసనోల్లంఘనమును గాంధి ఒక చెంప ఉపసంహరించినవాడు మరొక చెంప అతి తీవ్రమగు వ్రాతవ్రాసి ప్రకటించెను. ఇగ్లండు నుండి మాంటేగూ మంత్రియు, బర్కెన్ హెడ్ ప్రభువును గూడి భారత ప్రజను తృణీకరించుచు దుర్గర్వభూయిష్టమగు తంతివార్త నంపుటే అందులకు గారణము.* దీనికి ప్రతిగా గాంధి వ్రాసిన తీవ్రోక్తు లివి :

"దుర్బలులను పీల్చుకొని తినుటయే పరమార్థముగా, నిరంతర పశుబల ప్రదర్శనమే ఆధరువుగా ఈ బ్రిటిషు సామ్రాజ్యము బ్రదుకు చుండగా దీనితో సమాధాన పడుట ఎట్లు పొసగును ?......ధర్మరక్షకుడగు జగదీశ్వరుడున్నచో ఇది మన నేరదు. 1920 లో మన మారంభించిన పోరు

* "మన సామ్రాజ్యమునకు ముప్పు కల్గిన పక్షమున మన ప్రభుత్వము తన బాధ్యతను నిర్వహించుట కాటంకము ఏర్పడిన పక్షమునను, మనము ఇండియానుండి తరిలిపోదుమను భ్రాంతిచే గొంతెమ్మ కోరికలు కోరిన పక్షమునను, దృఢాతి దృఢ చిత్తులగు ఆంగ్ల ప్రజలు జంకరు. ధీర హృదయులై మరల పరాక్రమించి నిలుతురని గ్రహింపవలెను."

ఒకనాటిది కాదనియు, ఎన్ని నెలలైనను, ఎన్నేండ్లు గడచినను సిద్ధి పర్యంతము ఆ పోరు సాగితీరుననియు బ్రిటిషు ప్రజలు ఇప్పటికైనను గ్రహించుట మంచిది......తుదిదాక అహింస నవలంబించు శక్తిని, అడుకువను పరమేశ్వరుడు భారతభూమి కనుగ్రహించుగాక! దుర్గర్వ భూయిష్ఠములై, ఎడప దడప ఉరికి పడు ఈ తంతివార్తలకు తల యొగ్గు పాక మెన్నడో తప్పినది.”

౪

ఈ వ్యాసమందును, మరిరెండు వ్యాసములందును గాంధి ప్రజలను ప్రభుత్వము నెడల విరక్తుల జేసెనని రాజ ద్రోహాపరాధము నారోపించిరి. గాంధి తాను నిర్దోషినని చెప్పక, ఆ నేరము లన్నియు దాను చేసితినని అంగీకరించెను.

“ప్రభుత్వ న్యాయవాది యగు సర్ జె. టి. స్ట్రాన్గ్ మన్ గాంధి చేసిన నేరములు వివరించుచు కేవల మీ మూడు వ్యాసములే కాక ఇట్టివే పెక్కు వ్యాసములను గాంధి రెండేండ్లనుండి ప్రకటించి ప్రజలకు రాజాపరక్తిని బోధించెనని ఆ వ్రాతలనుండి పెక్కు భాగము లుదాహరించెను. గాంధి మహాభాగుడే యగును గాని అట్టి వాడిట్టి వ్రాతలు వ్రాయుట మరియు ప్రమాదమనెను. బొంబాయి, చౌరి చౌరా దుండగముల బాధ్యత గాంధిదే యనెను. అహింసను రాజాపరక్తితో కలిపి బోధించుటచే ప్రజల హింసా కర్మ బాధ్యత యంతయు గాంధి వహింపక తప్ప దనెను. గాంధి యంతట నొక వాఙ్మూల మిచ్చెను. తా నను

సరించుచున్న మార్గము నందలి ధర్మా ధర్మములగూర్చి, తత్ఫలితమగు ప్రజాప్రవృత్తిని గూర్చి అప్పటికి కొన్ని మాసములనుండి గాంధి చెందుచున్న భయాందోళనములు, సంశయములు అందు కన్పింపవు. ఆయన స్థితప్రజ్ఞుడై చెప్పిన మాట లవి. అంతకుముందు జరిగినవి-పిమ్మట జరుగనున్నవి, అన్నిటికి బాధ్యత తనదే యనెను. అట్లు జరుగవలసి జరిగిన ఆ పనులకు తానును సంతాపము చెందుచున్నను వానిని ఆమోదించుట తనధర్మ మనెను. ప్రభుత్వ న్యాయవాది చెప్పినదంతయు నిజమే. సర్వమునకు బాధ్యత తనదే, తన యొక్కనిదే! రాజాపరక్తిని బోధించుట తనకు ఆవేశము వంటిది. మదరాసునం దలజడికి, చౌరీ చౌరా యందలి రాక్షసత్వమునకు, బొంబాయిలో జరిగిన అకార్యములకు అన్నిటికి తానే బాధ్యుడు.

"ప్రభుత్వ న్యాయవాది సత్యమే వచించెను. అంతయో యింతయో విద్యావంతుడనై, కొంత లోకానుభవముండి బాధ్యతగల నా వంటివాడు తాను చేయు పనుల మంచిచెడ్డలను, తత్పర్యవసానమును ఎరిగి యుండవలెను. నేను నిప్పుతో చెలగాటమాడుచుంటి నని యెరుగుదును. ఎరిగియు సాహసము నొనర్చితిని. నన్నిపుడు విడిచి పుచ్చినచో మరల ఆ పనియే చేయుదును. ఈ మాటలన్నియు నిచట చెప్పకుండుట ధర్మహాని యని నాకు నేటి ఉదయమున తోచినది.

"హింసను త్యజింప వలెననియే నా సంకల్పము, ఇప్పటికి నాకదియే తలంపు. అహింస నాకు పరమ ధర్మము.

నా మతమున అదియే చరమసిద్ధి. కాని, నా దేశమునకు మహా ద్రోహ మొనర్చిన వ్యవస్థకు నేను తలయొగ్గి, మిన్న కుండుటో, నా ప్రజలు క్రోధవివశు లైనను సరియే యని దాని యాథార్థ్యమును నా నోటివెంట వారికి చెప్పుటో-ఈ రెంటిలో నేదియో యొకటి నేను తేల్చుకొనవలసి వచ్చినది. నా ప్రజలు క్రోధోన్మత్తులైన సందర్భములు నే నెరుగుదును. అది నా తప్పేయని వగచుచు, ఆ నేరమునకు విధింప దగిన అత్యధిక దండనమునకు తలయొగ్గి నే నిచట నిలిచితిని. నా పట్ల దాక్షిణ్యము వలదు. నా చేసిన అపరాధమున దాక్షిణ్యము వహించదగిన సందర్భములును లేవు. భారత పౌరునకు పరమ ధర్మమగుపని యేమో నేను చేసితిని. శాసన దృష్ట్యా ఆ పని బుద్ధిపూర్వకమగు అపరాధమే యగును. కావున మీరు విధించగల అత్యధిక దండనమును విధింపు డని కోరి, దాని ననుభవించుటకు సిద్ధమై ఇచట నిలిచితిని. నేను లిఖిత పూర్వకముగా చెప్పనున్న విషయ మొకటి ఇవుడే చెప్పు చున్నాను. న్యాయాధికృతులగు మీకు రెండే మార్గము లున్నవి. మీరు మీ యుద్యోగమునకు చెల్లు చీటివ్రైన నీయ వలెను. లేదా, మీ ద్వారా ప్రవర్తితమగు చున్న ఈ ధర్మ శాస్త్రపద్ధతి ప్రజలకు క్షేమకరమే యని మీకు నమ్మక మున్నచో మీరు విధింప గలిగిన పరమ దండన మైనను నాకు విధింప వలెను.''

రాజకీయ నాయకుని స్థిర చిత్తముతో పుణ్యాపాప విచార దక్షమగు ధర్మజ్ఞత మేళవించిన ఈ వాఙ్మాల మిచ్చిన పిమ్మట ఆంగ్లేయులను, భారత ప్రజను ఉద్దేశించి గాంధి

లిఖిత పూర్వకమగు ఈ మాటలు చెప్పెను. "ప్రభువుల యెడ సుదృఢమగు నా యనురక్తియు, సహాకారమును ఇట్లు విరక్తిగాను, వైముఖ్యముగాను ఎందుకు మారిపోయినవో మీకు చెప్పుట నా ధర్మము," అని మొదలిడి 1893 నుండి నడచిన తన ఐహిక వ్యవహారమంతయు వివరించెను. తాను భారతీయు డైనకారణమున ఆంగ్ల ప్రభుత్వము తన్ను ఎట్టి కడగండ్ల పాలు చేసెనో ప్రస్తావించెను. బ్రిటిషు సామ్రాజ్యము నుండి విడివడకుండనే భారతీయుల దుస్థితిని తొలగింప వచ్చునను ఆశతో పాతికేండ్లనుండి తాను పడిన పాట్లన్నియు తెలియ జెప్పెను. 1919 వరకు గూడ తాను రాజానురక్తిచే సహకరించుచునే యుంటిననియు, అప్పటికి ప్రభుత్వ దురాచరణములు మితిమీరి పోయెననియు తెలిపెను. "తాను చేసిన అపచారములకు ప్రభుత్వము నిష్కృతి చేసికొనలేదు సరికదా, పాపాచరణ మొనర్చిన తన యధికృతులను మెచ్చికొని, గౌరవించి, తలపై నెక్కించుకొని, ఉరిసిన పుండుపై నుప్పు చల్లినట్లు భారత ప్రజలచిత్తమును గాయపరచెను. ప్రభుత్వమే ప్రజలను చేసేత విరక్తుల నొనర్చుకొనెను." ఇపుడు తలపెట్టిన ప్రభుత్వ సంస్కారములు గూడ భారతము పట్ల ఘోరాపచారమును చేయునని తాను నమ్మితినని తేల్చెను.

"ప్రజలను పీల్చుకొని తినుటే ఈ ప్రభుత్వమునకు ఆదరువు. అందుకొరకే ఈ ధర్మశాస్త్రమంతయు నిర్మితమైనది. ఆ పరపీడకుల పొట్ట నింపుటకే ఇచట ధర్మము ప్రవర్తితమగుచున్నది. ప్రజలను భయత్రస్తుల నొనర్చుటలో

పరమ నిపుణము, పటిష్ఠము నగు ఈ ప్రభుత్వ పద్ధతిచే ప్రజలు నీతి రహితులు, కపట శీలురు నయిపోయిరి. భారతమును సర్వనాశన మొనర్చి, గర్భదారిద్ర్యమున ముంచి, పతితను గావించినారు. ఈ స్థితినుండి బైటబడి భారతము స్వామిని యన్ ప్రతిపత్తి నందవలె నన్నచో కొన్ని పురుషాంతరములు గడవవలెనని మాలో విజ్ఞులు కూడ తలపోయు దుస్థితి వచ్చిన దీ దేశమునకు. భారతము పట్ల ఇంగ్లండు చేసిన యింతటి అపచారము మ న్నేప్రభుత్వమును చేయలేదు. ఈ పాప కార్యమునకు, ద్రోహమునకు తోడ్పడకుండుటే పరమ పుణ్యము.''

అట్లు తోడ్పడకుండెడి ఘనకార్యమును గాంధి సాధించెను. అంతియే కాక, అంతకు మున్ను హింసయే శరణ్యమను కొన్న ప్రజలకు అహింసయను పరమ సాధనమును గూడ ఆయన అనుగ్రహించెను.

ౠ

పిమ్మట ధర్మాధికృతియు, మహాత్ముడును ఒకరిని మించి యొకరు సముదార సరస సంభాషణలు సల్పిరి.

ధర్మాధికృతి తీర్పు పాఠమిది :—

''గాంధిజీ! మీరు నేరము నొప్పికొని నా పని తేలిక గావించితిరి. కాని, అర్హమగు దండనమును నిర్ణయించే భార మొకటి మిగిలియున్నది. ధర్మదేవతకు అపరాధుల మాన్యతతో పనిలేదు. అట్లయ్యు నే నింతకు పూర్వము విచారించినట్టియు, ఇకముందు విచారింప నున్నట్టియు పురుషు

లందరిది నొకయెత్తు, మీదొక యెత్తు అని గణింపకుండుట పొసగదు. అంతియే కాదు; కోట్లకొలది భారతీయులు మిమ్ము దేశ భక్తాగ్రగణిగా, మహానాయకుడుగా మన్నింతురనియు గమనింపక తీరదు. రాజకీయ వ్యవహారములందు మీతో ఏకీభవింపనివారు కూడ మీ మహదాశయమును, ఉదార జీవనమును, మహాత్మతను మన్నింతురు. అట్లయ్యు, మీరు శాసనము నుల్లంఘించితిరి. లోక సామాన్యము దానిని రాజ ద్రోహముగా నెంచును. అట్టి నేరమును చేసితిమని అంగీ కరించి మీరు నాకు దండ్యులైతిరి. అంతే. మిమ్మును గూర్చిన ఇతర విచారణ నాకప్రస్తుతము, అవిధాయకమును. హింస కూడదని మీరు దృఢముగా చెప్పుచునే యున్న విషయము నేను మఱవను. పలుమారులు మీ రడ్డుపడి హింసను మాన్పించితిరనియు నాకు నమ్మకమే. కాని, మీ రాజకీయ ప్రచార లక్షణమును, దాని నాలకించు ప్రజల స్వభావమును బట్టి ఈ యుద్యమము హింసాకాండ లోనికి దిగదని మీరు ఎట్లు నమ్మితిరో నే నూహింప లేకున్నాను.

"ఏ ప్రభుత్వమేనియు మిమ్ము స్వేచ్ఛగా విడుచుటకు వీలులేనిస్థితిని మీరు కల్పించితిరి. ఇందులకీ దేశమున చింతి ల్లని వారరుదుగా నుందురు. ప్రజాక్షేమ రక్షణమునకై ఏమి చేయవలసి యుండును? ఆ చేయునది మీకు ఆర్థ్యముగా నుండవలెనుగదా! అని నే నాలోచింపగా 12 ఏండ్ల క్రితము జరిగిన నేరము-చాలవరకు ఇట్టిదేయగు బాల గంగాధర తిలకు నేరమున విధించిన దండనము వంటిది విధించుట యుక్తమని తోచినది. ఆయనకు మొత్తమున ఆరేండ్ల

సామాన్య కారావాసము విధించిరి. శ్రీ తిలకు శ్రేణిలో మిమ్ము పరిగణించుట అయుక్తమని మీరు భావించరను కొనుచున్నాను. కావున ఒక్కొక్క నేరమునకు రెండేళ్ళు చొప్పున మొత్తము ఆరేండ్లు సామాన్య వరకము మీకు విధించుట నాకు ధర్మమని తోచినది. ఇంకొక మాటకూడ చెప్పుచున్నాను. భారతమున దేశకాల పరిస్థితులు అనుకూలించి, ప్రభుత్వము మీా దండనమును తగ్గించి, మిమ్ము ముందుగనే విడిచి పుచ్చగలదేని అందులకు నాకంటె అధికముగా సంతోషించు వారుండరు."

పిమ్మట ధర్మాధికృతి బ్యాంకరుతో నిట్లనెను:—
"మీరు మీా నాయకుని చెప్పుచేతలలో మెలగితిరని తోచుచున్నది. కావున మొదటి రెండు నేరములకు ఆరేసి నెలల సామాన్య కారావాసమును, మూడవ నేరమునకు వేయి రూప్యముల దండుగయు విధించుచున్నాను. ఆ దండుగకు ప్రత్యామ్నాయముగా మరి యారు నెలలు కారావాసము చేయవచ్చును."

గాంధియు తుల్యగౌరవముతో ని ట్లనెను :—

"నాదొకమాట. లోకమాన్యుడు బాలగంగాధర తిలకుతో నన్ను సాటిచేయుట నాకు మహాగౌరవముగా, గర్వకారణముగా భావించుచున్నాను. ఇక మీరు విధించిన దండన మంటిరా, ఇంతకంటె సులభ దండనము మరియే ధర్మాధి కృతియు నాకు విధింపలేదు. మొత్తము విచారణ మంతయు ఆదర పూర్వకముగా నడచుట సంతోష కారణము."

ఆ యపూర్వ ధర్మవిచారణ మిట్లు ముగిసినది. గాంధి మిత్రులు, భక్తులు ననేకులు కన్నీటితో ఆయన పాదము లంటి వీడ్కొనిరి. నగుమోముతో మహాత్ముడు వారినెల్లర వీడ్కొలిపెను. సబర్మతి కారాగృహము నాయన ప్రవేశించెను.*

*కస్తూరిబాయి ఈ వృత్తాంతమంతయు ప్రజలకు తెలియజెప్పి అందరును శాంతముగా నిర్మాణ కర్మకలాపమున మగ్నులు కావలసినదని శాంత గంభీరమగు ప్రకటన మొండు కావించెను. గాంధిని సబర్మతినుండి ఎరవాడ కారాగృహమునకు గొంపోయి అచట నిర్బంధించిరి.

## 9

# మహాత్ముని సందేశము

మూఁగ చెరసాలలో ఆ దివ్యవాణి యిట్లు మూఁగ వోయినది. ఆ దేహమును సమాధి కుడ్యములమధ్య పూడ్చి పెట్టగలరే కాని, తన్మహనీయ భావముల నెవరు అరికట్ట గలరు? విదేహమగు ఆ యాత్మ భారత మహాదేహమున సచేతనముగానే యున్నది. "శాంతి, అహింస, సహిష్ణుత"- ఇదియే కారాగృహమునుండి బయల్వెడలిన అనుపమ సందేశము. ఈ సందేశము నెల్లరు నాలకించి గ్రహించిరి. దేశము నాల్గు చెరగుల నాసందేశ మల్లుకొన్నది. అంతకు మూఁడేండ్ల క్రిందటనే గాంధిని నిర్బంధించినచో భారతము రక్తసిక్తమయ్యె డిది. 1920 మార్చిలో గాంధినిర్బంధమునుగూర్చి గాలివార్తలు వ్యాపించినపుడు భారత ప్రజలు అలజడి పాలైరి. కాని అహ మ్మదా బాదున విధించిన దండనము వినబడునాటికి ధర్మ చింతన శీలమగు భారతప్రజ మౌనవ్రతము తాల్చి యూర కొన్నది. వేలకొలది ప్రజలు అనుద్వేగముతో, ఆనందముతో నిర్బంధమును వరించిరి. ప్రతీకారము సేయనొల్లని ఈ యపూర్వ ప్రతిఘటనము, ఆ దివ్యసందేశము భారతాత్మ నెంతగా వశీకరించినదో తెల్లమొనర్చెను.



భారత వీరప్రజలలోకెల్ల సిక్కులు వీరశాఖను లని

జగద్విదితమే. మొన్నటి మహాయుద్ధమున సిక్కులనేకులు నియుక్తులైరి. క్రిందటి సంవత్సర మాతెగలో పెద్దచీలిక పుట్టెను. మనదృష్టి కా విభేదకారణములు శుష్కముగా కని పించును. సిక్కుల గురుద్వారముల నేలు ధర్మకర్తలు నీతి బాహ్యులై, అందు పీటవెట్టుకొని కదలకుండిరి. ఆ గురు ద్వారముల పవిత్రతను రక్షించుటకై సిక్కులలో అకాలీలను తెగయొకటి ఏర్పడెను. ప్రభుత్వము రాజధర్మ రక్షణకై తవ మున ధర్మకర్తల పక్షము వహించెను. 1922 ఆగస్టులో ఆరంభమైన 'గురుకాబాగ్' ప్రాణాహుతి కిదియే కారణము. అకాలీలు అప్రతీకారవ్రత మవలంబించి, వేయిమంది గురు ద్వారముచెంత ప్రాణాచారముండిరి. అమృతసర స్వర్ణాలయ మున నాల్గువేలమంది సమావిష్టులైరి. వారిలో చాలమంది కాసెగట్టిన వీరులును, మొన్నటి రణరంగమున నిలిచిన వారును. వారిలో అనుదినము నూర్గురు కర్మణా, వాచా అహింసావ్రత దీక్షితులై స్వర్ణాలయమునుండి గురుకా బాగుకు ప్రస్థానమొనర్తురు. వా రాగురుద్వారమును ప్రవే శించుటయో, నిశ్చేతనులై అటనుండి కొనిపోబడుటయో తప్ప వెనుకకు మరలి వచ్చుట యనునది మరిలేదు. గురుద్వారము చెంతనున్న వేయిమందిలో ఇరువదియైదుగురకు గూడ అను దినమిదియే వ్రతము. వీరి నడ్డగించుటకై గురుద్వారము చెంత ఆంగ్ల పోలీసుభటులు ఇనుపపొన్ను వేసిన కురుచ దండ ములతో నిలిచి యుందురు. అనుదినము అచట నట్లు ప్రవ ర్తిల్లిన బీభత్సమును ఆంండ్రూసు వర్ణించెను. ఆ వర్ణనలు మఱపు రావు. నల్లని తలపాగలును, తెల్లని పూదండలను

తాల్చిన అకాలీలు నడచివచ్చి పోలీసుదళమున కెదుట నించుక ఎడముగా ధ్యానముద్రానిశ్చలులై మౌనము తాల్చి నిలుతురు. పోలీసు లంతట దండప్రహారములచే వారిని మోద నారంభింతురు. అకాలీ లా దెబ్బలకు నేలగూలి మరల లేవ గలిగినచో లేచి నిలుతురు. పోలీసులు వారిని మరల ప్రహ రించి నేలగూల్తురు. కొందరిని ప్రాణావశిష్టు లగువరకు మోదుట కద్దు. అట్లు చావమోదుచుండ నాయజ్ఞదీక్షితు లలో నొక్కరును చేయెత్తి వారించిన సన్నగాని, వా యెత్తి ఆక్రోశించిన యులివుగాని లేదని ఆంద్రూసు వర్ణించెను. అల్లంత దవ్వున నిలిచి చూచెడివారు విషాదచ్ఛన్న వదనులై, "బాధా సహిష్ణుతయు, పూజయుదోప మౌనముగా ఈశ్వర ధ్యాన మొనర్చుచుండిరి. జీజసునాటి సిలువనీడలవలె వారు నాకు తోచి," రనియెను ఆంద్రూసు. తమ తమ పత్రికలలో ఈ గాథను వర్ణించిన ఆంగ్లేయులు ఈ బాధాసహిష్ణుత కచ్చెరు వందితి మనిరి. ఇందలి పరమార్థమును వారు గ్రహింప కున్నను అపహాస్యభాజనమగు ఈ త్యాగము సత్యాగ్రహ మునకు జయపతాక వంటిదనియు, పాంచాల వీరుల హృద యముల నది వశీకరించెననియు సానుతాపమున్మై నంగీక రించిరి. ఉదారభావుడు, సత్యద్రష్టయు నగు ఆంద్రూసుకు మాత్రము ఇందు భారతాత్మ సాక్షాత్కరించెను. నూతన శకారంభము నాత డిందు దర్శించి, "బాధాసహిష్ణువగు అపూర్వవీరము పృథ్విపై నవతరించెను. ఈ ధర్మవీరమున ఆత్మయే యోద్ధ," అనెను.

అహింసాచార్యుడగు గాంధి ధర్మమునకు ప్రవర్తకు లగు నాయకులకంటె ప్రజలకే ఆ ధర్మోపదేశ మెక్కువగా హృద్గతమైనది. గాంధి నిర్బంధమునకు మున్నే డిల్లీ కాంగ్రెసు కార్య నిర్వాహకుల సభలో పొడచూపిన వివాదాంకురములు 7-6-1922 న లక్నో సమావేశములో మరల తలయెత్తెను. గాంధి ఉపదేశించినట్లు నిర్మాణ కార్యములందు మునిగి, చేతులు ముడిచికొని ఎదురు చూచుట కొందరికి అసంతృప్తి, కల్గించెను. వెంటనే శాసనోల్లంఘన మారంభింప వలెనను కోరిక బలీయమై తోచెను. అట్టి శాసనోల్లంఘనమునకు దేశ మున అనుకూల్యమున్నదో లేదో పరిశీలించుటకు కొందరి నేర్పాటు చేసిరి. వారి విచారణ ఫలితము చాల ఆశాభంగ మును సమకూర్చెను. శాసనోల్లంఘనమునకు సుతరాం అను కూల్యము లేదనుటే కాక, కొందరు సభ్యులు (వారందరు కాకలుదీరిన దేశభక్తులే). ప్రభుత్వపు విందులను బహిష్క రించుట మున్నగు సహాయ నిరాకరణ సూత్రములను విడ నాడదగుననియు, శాసన సభాచర్యలలో పాల్గొనుచు ప్రభుత్వ ప్రతిపక్షము వహించుటకై స్వరాజ్య పార్టీని నిర్మింప దగు ననియు సూచించిరి. అట్లు చేసినచో శాసన సభలలోనే సహాయ నిరాకరణము సాగింపవచ్చు ననిరి. ఈ విధ ముగా గాంధి ధర్మసూత్రమును హింసానుకూలు రొక వంకకు, శాసన సభా ప్రవేశానుకూలు రొక వంకకు లాగి తునియలు గావించిరి.

ఇందులో రెండవదగు మందగమన ధోరణిని గయలో జరగిన కాంగ్రెసు మహాసభ నిరసించెను. కారా ప్రవాసియగు అహింసాచార్యుని యెడ భారత ప్రజకు గల భక్తికి, ఆయన ధర్మముపట్ల విశ్వాసమునకు ఆ మహాసభలో పునః ప్రతిష్ఠ జరగెను. శాసన సభా ప్రవేశ నిశ్చయమునకు 1,740 మంది ప్రతికూలురు, 890 మంది అనుకూలురునై, దానిని త్రోసిపుచ్చిరి. ఆంగ్లేయ వస్తువు లన్నిటిని బహిష్కరించుటకు గూడ ఆ మహాసభ అంగీకరింపలేదు. అట్లు బహిష్కరించినచో పాశ్చాత్య పారిశ్రామిక లోకమంతయు భారతముపట్ల విరక్తమగునని ఆ మహాసభ భావించెను. తీవ్ర గమనశీలమగు ముస్లిము ఖిలాఫత్ మహాసభయందు మాత్ర మీ బహిష్కారము బహుజన సమ్మతిచే నిశ్చిత మయ్యెను.

3

ఇంతటితో ఈ కథాక్రమమునకు స్వస్తి చెప్పుచున్నాము. అహింసాచార్యునియు, ఆయన ప్రధాన శిష్యులయు పరోక్షమున కొన్ని తప్పుటడుగు లనివార్యమే యైనను అనాయకమగు గాంధి ఉద్యమము ఆ మొదటి సంవత్సరము విషమ పరీక్షలను గడచి ధీరముగా సాగెననియే చెప్పవలెను. గయా నగర కాంగ్రెసు సభానంతరము బ్రిటిషు పత్రికా వార్తల లోని ఆశాభంగము గూడ కాంగ్రెసు ఉద్యమ విజయమునే సూచించుచున్నది.*

* 16-11-1922 న బ్లాంచి వాట్సను అను నామె సహాయ నిరాకరణోద్యమము ఇండియాకు ప్రయోజనకారి యయ్యెనని వ్రాయుచు కొన్ని వివరములు ప్రకటించెను. దేశము మొత్తమున ఆదాయము 7½ కోట్ల

ముందుముం దీయుద్యమము ఏమికానున్నదో? ఆంగ్ల ప్రభుశక్తి వెనుకటి తప్పులను దిద్దికొని, ఈ భారతీయో

డాలర్లు తగ్గెనట. ఇంగ్లీషు వస్త్ర బహిష్కారముచే ఇంగ్లండుకు ఒక్క యేటనే 2 కోట్ల డాలర్లు నష్టము వచ్చెనట. 30,000 మంది భారతీయులు చెరసాలలలో మగ్గుచుండిరట. బ్రిటిషు పరిపాలన యంత్రము భగ్నమైన దట. ఈమె గాంధి భక్తురాలు గావున ఈ వ్రాతలలో కొంత అతి శయోక్తి అవశ్యమై దొరలి యుండును. మరికొందరు త్యాగ ప్రధానమగు ఈ యుద్యమము భారత ధనికులకు, వణిక్కులకు బాధాకరమయ్యె ననియు, ఉద్యమపు మొదటి పొంగులో ఉద్యోగములు విడనాడినవారిలో చాలమంది మరల ఉద్యోగములలో ప్రవేశించిరనియు వ్రాసిరి. ఇది మానవ స్వభావాను గుణమే గాని యిందు వైపరీత్య మేమియు లేదు. ఇట్టి విప్లావ కోద్యమములలో కొందరు వెనుక బడుటయు, కొందరు తిరోగమించుటయు గద్దు. దానికేమి గాని ఈ ఉద్యమ ప్రవాహ మింకి పోయినదా, జీవనదియై పొలుచున్నదా యని చూడవలెను.

పక్షపాత రహితమగు 'మాంచెస్టరు గార్డియన్' పత్రిక ఈ విషయ మున నేమనుచున్నదో చూతము. ఉదారభావ మహితమును, సహాయ నిరాకరణముచే నష్టపడిన ఆంగ్లేయుల కభిమాన స్థానమగు ఈ పత్రిక తన ప్రతినిధిని భారతభూమి కంపెను. అతడు చెప్పిన విశేషములను వరుసగా ప్రకటించెను. ఆ వ్రాతలలో సహజ పక్షపాత మొకించుక లేకపోలేదు గాని మొత్తము మీద ఇంగ్లండుకు వాటిల్లిన ప్రమాదము మాత్రము కన్పించు చున్నది. అతడు వ్రాసిన చివరి వ్యాసము నిచట సంగ్రహింతును. అందు అతడు గాంధి ఉద్యమము వెనుక బట్టెననియు, దానిని క్రొత్త దారి త్రొక్కింపవలసి యున్నదనియు చెప్పి మరియు నిట్లనెను. "కాని ఆ ఉద్యమవాసనలు మాత్రము మిగిలియే యున్నవి. ప్రజలందరకు విజాతీయ ప్రభుత్వముపట్ల సందేహములు పుట్టినవి. దాని బంధమునుండి తప్పుకొను టెట్లను ఆలోచన ప్రబలినది. విద్యావంతులకు, పట్టణవాసులకు ప్రభుత్వవిరక్తి బాగుగా తలకెక్కినది. నేడు గాకున్న రేపేనియు కర్షక లోకమునగూడ ఇది ప్రాకిపోవును. సైన్యమున ఇంకను ఈ విషము

త్సాహ శక్తి నిష్ఫలమైన వివేకముపై పంట గావించుకోన కుండునా? కాలక్రమమున భారత ప్రజల పట్టుదల సడలి పోకుండునా? ఏ దేశ ప్రజకేనియు దీర్ఘస్మృతి యుండదు. కావున భారత ప్రజకూడ మహాత్ముని యుపదేశమును చిర

వ్యాపింపలేదు. గాని సైనికులెల్లరు గ్రామసీమల వారే కావున కాల క్రమమున వారికిగూడ ఇది యెక్కక తప్పదు. ముఖ్యముగా బుద్ధిశాలు రును, మితవాదులు నీ యుద్యమమున కాయువుపట్టు. మితవాదులకు తీవ్ర సాధనములు గిట్టనిమాట నిజమే గాని ప్రజాసామాన్యమున కట్టి ఏవ మున్నట్లు లేదు. ప్రజలకు సత్యాగ్రహుల సాహస చర్యలవలె మితవాదుల మందగమనము రుచించుటలేదు. కర్షక లోకము పన్నుల నెగబెట్టుటకు మరి పదియేండ్లు పట్టవచ్చును. ఈలోపల ఈ వ్యవహారము శ్రుతి మించు చునే యుండును. భారతీయులకు చెఱసాలభయము తీరిపోయినది. దారుణ దమనచర్య లవలంబించక తీరదు. అట్లవలంబించినచో ఆంగ్లజాతి పట్ల ప్రజలకు ద్వేషము పెరిగి పోవును. ఇంగ్లండుకు మిగిలినదొక్క సామోపాయమే. భారత రాజతంత్రమును సంస్కరించు టొక్కటే ఈ ప్రమాదమును తప్పించును. 1919 నాటి సంస్కరణలు చాలవు. తరుణము మించి పోనీయక వెంటనే శిష్టభారతీయ పరిషత్సమా వేశమును సమకూర్చుట మంచిది. అందు గాంధేయులు, వణిక్ప్రముఖులు, సంస్థానా ధిపులు, హైందవ పారసీక ముస్లిము క్రిస్టియను మతస్థులు, అస్పృశ్యులు ఐరోపీయులు-వీరందరు పాల్గొనవలెను. బ్రిటిషు సామ్రాజ్యమున భారత దేశము స్వతంత్ర ప్రతిపత్తిని పొందే పథకమును ఆ పరిషత్తు నిర్మింప వలెను. ఆ ప్రతిపత్తిని పొందుటకు దాటవలసిన ఘట్టములను గూడ అందు పేర్కొనవలెను. సామ్రాజ్య విచ్ఛిత్తిని నివారించుట కిదియే యుపా యము."

భారత ప్రభుత్వమునకు, బ్రిటిషు పాలకులకు నిది రుచించునో, లేదో నాకు తెలియదుగాని గాంధియు, తదను యాయులును, వణిక్ప్రముఖులతో, ఐరోపీయులతో కూడబలికికొనుటకు కలసివత్తురని నాకు నమ్మకము కుదు

కాలము స్మృతియందు నిలుప జాలదేమో యని నేను సంశ యించు చున్నాను. ఆయాప్రజల స్వభావమున కనుగుణము గానిధర్మమేదియు స్మృతి పథమున అంకితము కాజాలదు. తన యుపదేశములు సాటిప్రజల చిత్తవృత్తి కనుగుణమైనను కాకున్నను ఒకానొకడు నిజోదారసత్త్వము చేతనే మహత్త్వము నార్జించును. అట్టి వానియందు దేశకాల ధర్మములును, ప్రజాస్వభావమును మూర్తిమంతమగుటయు చొప్పడు నేని వానిప్రభావ మప్రతిహతమై విరాజిల్లగలదు.

౪

గాంధియన అట్టిమహాత్ముడు. ఆయన ప్రవచించిన అహింసాధర్మము రెండు వేలేండ్లనుండి భారతాత్మ యందంకితమై యున్నది. మహావీరుడు, బుద్ధుడును, వైష్ణవ మతమును కోట్లకొలది జనుల కీ ధర్మమునే నూరిపోసినది. గాంధి తన ఉత్సాహ శక్తిచే దోహదమొనర్చి, ఆ ధర్మమును పునరుద్ధ

రుట లేదు. ఏది యెట్లయినను భారత స్వరాజ్యసిద్ధి మాత్రము తప్పదు. గాంధి నడుము కట్టిన నాటినుండి బ్రిటిషు పత్రికల ధోరణిమారె ననుట విస్పష్టము. పాశ్చాత్యులు భారతీయులను చిన్నచూపు చూచుట, వెనుకబట్టి గౌరవ భాజనులనుగా పేర్కొనుట యారంభమైనది. ఇస్సాళ్ళు ప్రభుత్వమునకు దండనీతియే ప్రధానోపాయమని చెప్పువారెల్ల ఇపుడు దండనీతిని అనుచితమనియు, అవిచారిత మనియు దెగడసాగిరి. ఇది భారతము సాధించిన ధర్మవిజయము.

రించెను. మృతప్రాయమై పడియున్న ఆ సనాతన ధర్మప్రేత ముల కాతడు ప్రాణప్రతిష్ఠ చేసెను. పరమ బంధువగు గాంధి మంత్రము నుచ్చరించినంతనే అవి పునరుజ్జీవితము లయ్యెను. ఆయనది వట్టి ఉపదేశము, ప్రచారమే కాదు. ఆచరణము నం దందె వేసిన ధర్మాచార్యుడాయన. భారతాచార్య పురుషు లందరు ఆయనయం దవతరించిరి.

ఇట్టి యవతారములు అదృష్టవశముననూ, అకారణము గను సంభవింపవు. మానవ లోకము చేయుచున్న చిర తపః ఫలముగా, పావన భారతాశ్రమములనుండి, దేవాయతన ములనుండి భారతాత్మయే యిట్లు సాక్షాత్కరించినది.

ఈ యవతార మహిమ భారతపు టెల్లల నతిక్రమించి సర్వవ్యాపియైనను ఇట్టి వరదానము భారతముననే చెల్లును. భారత త్యాగసంపదయు, మహత్త్వము నిందు మూర్తి గైకొన్నవి. ఈ యజ్ఞకుండమున భారతము తన్ను దా వేల్చి కొన్నట్లయినది.

ఒకానొక ప్రజ యిట్లు బలిగాకున్నచో మానవ లోకము పునరుజ్జీవింపదు కాబోలు. తొల్లి యూదు ప్రజలిట్లే బలియైరి. వారు చిరకాలముగా ఈశ్వరుని యవతారమును ప్రతీక్షించియు, తుదకు రక్తసిక్తమగు శూలాగ్రమున నది పుష్పించి నపుడు దానిని గురుతింప నేరరైరి. భారతీయులు యూదులకంటె అదృష్టవంతులుగాన ఆ ఈశ్వరావతార మును గుర్తించిరి; గుర్తించి, బంధమోక్షమునకు వలయు బలిదానమును సంతోషముమై నర్పించిరి.

ఈ బంధమోక్షమన నెట్టిదో తొల్లిటి క్రైస్తవుల

వలె అందరు నెరుగరు. వారు చాల కాలము భూమిపై ధర్మ రాజ్య మవతరించునని నమ్మిరి. భారత సత్యాగ్రహమున పాల్గొన్న వారిలో చాలమందికి స్వరాజ్య లబ్ధియే బంధ మోక్షము. అంతకంటె పెద్దచూపులేదు వారికి. ఆ స్వరాజ్య మేమో అచిర కాలముననే లభించి తీరును. యుద్ధములతో, విప్లవములతో క్షతగాత్రమై, నిరుపేదయై, నిష్పచ్చరమున మునిగి యున్నది యూరపు. ఇన్నాళ్లును తాను పీల్చుకొని తిన్న ఆసియా లోనది అప్రతిష్ఠపాలై పోయినది. నిదుర మేల్కొన్న భారత చీనా జపాను దేశములందును, ఇస్లాము ప్రజలందును, ఆసియా భూభాగమం దెచ్చటను దాని ఆచా ర్యత్వ మిక సాగదు.

౨

కొన్ని దేశము లిట్లు క్రొత్తగా స్వతంత్రము లైనంత మాత్రమున నిండునది లేదు. మానవ స్వరమేళమున అవి కొన్ని క్రొత్తస్వరము లాలపించినను చాలదు. స్వతంత్రము లైన ఈ ప్రాగ్దేశములు పురుషార్థ పరాయణములై, చావు బ్రదుకులకు క్రొత్త ప్రయోజనములను కల్పించి "లోకా స్స మస్తాః సుఖినో భవంతు" అను స్వస్తివచనమును సార్థక మొనర్పవలెను; జవసత్త్వము లుడిగియున్న యూరపు ఖండ ముచే ధన్యోస్మి అనిపింపవలెను.

లోకమంతటిని హింసాప్రభంజనము చుట్టబెట్టినది. ఈ తుపాను హఠాత్తుగా, అప్రతర్కితముగా వచ్చినది కాదు. శతాబ్దుల తరబడిగా ఆయాప్రజలు దురహంకారావిష్టులై

యుండిరి. విప్లవమనే దేవతారాధనము ఆ దురహంకృతికి పట్టము గట్టినది. ప్రజాతంత్రాక రాజ్యములను కన్ను మూసి కొని అనుకరించుటలో ఈ విప్లవ బీజములు మొలచినవి. వీని కన్నిటికి మకుటాయమానముగా ధనలుబ్ధులు పరిపాలకులై, నూరేండ్లుగా అమానుషమైన అధిక వస్త్రోత్పత్తిలో మునిగి పోయిరి. ఆ దురాశ వారిని యంత్రమునకు దాసుల నొనర్చినది. దానినుండి అర్థప్రధానమగు అనాత్మ వాదము పుట్టినది. దానిచే ఊపిరి సలుపక ఆత్మయే నాశనమైనది. ఈ యన్నిటి ఫలితముగా పాశ్చాత్య సభ్యతాసంపదను కోల్పోవు దురవస్థ సంఘటిల్లినది. భిన్నమానవ జాతులు భ్రాతృవధ కొడిగట్టి, దానికి ధర్మకవచము తగిలించి, ఆ ప్రచ్ఛన్న ధర్మ రక్షణము పేరితో పరస్పరము కుతుకలు నులుముకొను చున్నవి. ఫాసిస్టులు, నేషనలిస్టులు, బోల్షివిస్టులు, పరపీడితులు, పర పీడకులు–వీరందరు ఎవరికి వారు తామే అర్హుల మనుచున్నారు, దేనికి ? హింసా కర్మమునకు! ఏబది యేండ్లుగా ధర్మము బాహుబలము ననుసరించి నడచినది. నేటి కింకను తీసికట్టై బలమే ధర్మమై పోయినది. భుజబలము ధర్మము నిట్లు తనపొట్ట నిడికొన్నది.

నానాటికిట్లు శిథిలమగుచున్న మానవ లోకమునకు ఆశయు, శరణ్యమును కన్పించుట లేదు. దారిచూపు వెలుగును లేదు. మతధర్మములు మత్తుమందులవంటి యుపదేశములతో కాలక్షేపము చేయుచు, బలవంతులదారి కడ్డము రాకుండ మెలగుచున్నవి. అంతియేకాని అవి యెన్నడు ఆచరణము చేసి చూపవు. ఇక యుద్ధములను ప్రతిఘటించు శాంతి

కాములను (Pacifists) చూడబోయినచో వారును ఓపిక లుడిగి, అలసముగా, మందముగా మేక యరపు లరచు చున్నారు. త్రికరణ శుద్ధియు, ధర్మాభినివేశము చాలక వారిట్లు వెనుకముం దాడు చున్నారని తోచుచున్నది. అహింసా ధర్మసత్తను, దాని ప్రభావమును వారికెవరు బోధింతురు? ఆ ధర్మమునకు సున్న చుట్టిన నేటి లోకమునకు దాని ప్రభావము ఆచరణచే గాక మరియెట్లు నిరూపింప గలము?

౬

ఠాకూర్జీ! గాంధీజీ! మీరు భారత నదీమాతృకలగు సింధు గంగా వాహినుల వంటివారు. మీ యిరువురి బాహు బంధమున ప్రాక్పశ్చిమముల రెంటిని లోగొంటిరి. రాజసారంభోపహతమగు ప్రతీచిని, జ్యోతిర్మయ మహాస్వప్నమువంటి ప్రాచిని వలగొన్న మీరిరువురు ఈశ్వర ధామమునుండి అవతరించితిరి; హింసా ద్వేషములను నాగటి కఱ్ఱులచే చాళ్లువడిన ఈ భూమిపై ధర్మబీజములు చల్లిపొండు!

---

# 10

## ఉపసంహారము

"సమస్త లోకముతో బాంధవము కోఱకే మా పోరాటము...
అహింసాధర్మము మానవలోకమున అవతరించి పీటవెట్టినది.
విశ్వశాంతికి నాందివంటి దది." (గాంధి)

లోకశాంతి ఇంకను దాదాల నున్నది. దాని విషయమున మేము భ్రాంతికి లోనగుట లేదు. కడచిన యేబది యేండ్లనుండి మానవుల అసద్వర్తనమును, అత్యాచారములను, పాపకర్మములను కనులార గంటిమి. మానవ లోకముపై మాకుగల ప్రేమ కవియన్నియు భంజకములు కావు. మహాపాతకునిలో గూడ ఈశ్వరుడు అవిద్యావృతుడై ఉండనే యున్నాడు. ఇరువదవ శతాబ్దిలో యూరపు అనాత్మ వాదోపహతమైనదనియు, దాని అర్థవ్యవస్థ నాశనకారి యనియు మే మెరుగనిది కాదు. శతాబ్దుల తరబడిగా కరడుగట్టిన లోభ ద్వేషాదులచే జీవాత్మలచుట్టును పేరుకొన్న మాయావరణము వెలుగునకు దుర్భేదమనియు నెరుగుదుము. అట్లే అమోఘమగు ఆత్మ ప్రభావమును ఎరుగుదుము. ఇంతకంటె దట్టపు చీకట్లనుగూడ మహనీయుల ఆత్మకాంతి కిరణములు భేదించినట్లు మానవ లోకేతిహాసము ఘోషించు చున్నది. నేటి సుముహూర్తమున అల్లదిగో! భారతమున శివుని డమరుకము మ్రోగుచున్నది. "నిమీలిత నిటలాక్షుడగు నటరాజు విశ్వరక్షకై లయానుగుణముగా పదన్యాస మొనర్చుచు తాండవించు చున్నాడు."

లోకమును వెనుకకుగాని ముందునకుగాని హింసా మార్గముననే నడపగోరు ప్రబుద్ధులగు రాజనీతిజ్ఞులకు ఈ ఆస్తిక్యపు మాటలు రుచింపవు. ఈ యాత్మ ప్రత్యయమును వారు పరిహసింతురు. పాపము వారలేమెరుగుదురు? వారెంత నవ్విననూ నవ్వనిండు. నాకీ విశ్వాసము సడలదు. యూరపు మాబోంట్ల నపహసించి, అగచాట్ల పాలొనర్చుచున్నది. ఈ దేశమున (ఫ్రాన్సు) మేము పట్టుమని పదిమంది యేని లేము (నిజముగా పదిమందిమేనా?). నా భక్తి ఇతరులకు లేకపోయినంత మాత్రమున వచ్చిన నష్ట మేమియు లేదు. లోకుల నాస్తిక్యమును, పరిహాసమును గాంచియు లెక్కసేయక, భక్తి తన విశ్వాసమును విడువక చరించును. భక్తియు నొక పోరాటమే అందును, అహింస మరియు విషమమగు పోరాటము. శాంతి మార్గము దౌర్బల్యముగాని భీరుత్వముగాని కాదు. హింసకంటె దౌర్బల్యమే మాకు ప్రబల శత్రువు. నీరసమగు మంచితనముకంటె ప్రబలమగు చెట్టతనమే మెరుగు. దుర్బలచిత్తుల శాంతి కాముకత శాంతికి హాని చేకూర్చును. వారిది నాస్తిక్యము, భీరుత్వము నగునే కాని శాంతికామము కానే కాదు. అట్టి భీరువులు, భక్తిహీనులు ఈ పోరాటమునుండి తప్పికొందురు గాక! త్యాగమును, సహిష్ణుతను నేరని వారీ శాంతి పథమును త్రొక్కలేరు.

ఇదియే గాంధి సందేశము. సిలువ యొక్కటే ఆయ నకు లోపము. యూదులు లేనిచో రోము ఏసునకు సిలువను ప్రసాదించెడిది కాదని అందరు నెరిగినదే. బ్రిటనుకూడ రోమను సామ్రాజ్యము వంటిదే. కావున ప్రచోదనము లభించి నది. ప్రాగ్దేశ ప్రజలయాత్మ లామూలముగా గదల బారినవి. లోకమంతట ఆఘూర్ణనము వినిపించినది.

ప్రాగ్దేశములందు ధర్మము లయానుగుణముగ కాలాం తరముల అవతరించుచునే యున్నది. కావున గాంధి ధర్మము విజయమును చేపట్టుటో, లేక ఆనాటి బుద్ధదేవ ఏసు క్రీస్తుల వలె మరల ఈశ్వరుడు మానవత్వమును ధరించి మానవ లోక మునకు శాంతిని ప్రసాదించి, ధర్మము నుద్ధరించుటో జరు గక తప్పదు.

సమాప్తి